# నిత్య సౌందర్యలహరి

శంకరాచార్యుల సౌందర్యలహరికి పద్య గద్యానుకృతి

"శాంతిశ్రీ"

జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

ప్రశాంతి నిలయము

పుట్టపర్తి

NITYA SOUNDARYALAHARI
ప్రథమ ముద్రణము, ప్రతులు వెయ్యి
శుక్ల శివరాత్రి 1990

వెల రు 30

ఈ పుస్తకము ఆర్షధర్మ ప్రచారకులైన
తిరుమల తిరుపతి దేవస్థానములవారి
ఆర్థిక సహాయముతో ప్రచురింపబడినది

ప్రాయంకు
"శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి
ప్రశాంతి నిలయము అనంతపురము జిల్లా

నవోదయా పబ్లిషర్స్
విజయవాడ-2

ముద్రణ:
చైతన్య ప్రింటర్స్
విజయవాడ-2



భగవాన్ శ్రీ సత్యసాయి చరణ కమలములపై
ఈ కృతి సమర్పితము

శాంతిశ్రీ

బాబా

# జయగీతి

—డాక్టర్ కిరణశ్రీ

ఇందుశేఖర నవనవానందలహరి !
భవ్య సంస్తవ్య దివ్య సౌభాగ్యలహరి !
సత్య సాహిత్య శ్రీమత్ ప్రశాంతలహరి !
తల్లి ! విజయోస్తు ! నిత్యసౌందర్యలహరి !

ఆ కటాక్షమ్ములో రాకాశరచ్చంద్ర
చంద్రికాపూరముల్ జాలువారు
ఆ చిరునవ్వులో అందాల హరివిల్లు
సన్నజాజుల వానజల్లుకురియు
ఆ మధురోక్తిలో ఆమ్నాయ పరమార్థ
విజ్ఞానవాహినుల్ వెల్లివిరియు
ఆ పదస్పర్శలో అనురాగమయ వియ
ద్గంగా తరంగాలు పొంగిపొరలు

ఆమె ఋగ్యజుస్సామ మంత్రార్థగీత !
పాద కంజాత ! దివ్య శోభాసమేత !
సత్య ధర్మ ప్రపూత ! మా సాయిమాత !
విశ్వవిఖ్యాత ! మమ్ము దీవించుగాత !

# ఆత్మనివేదనము

శ్రీ సౌందర్యలహరి ఇది—

శ్రీ సాయీశ్వర మనోహరి ఇది— 'సమయ' ను

శ్రీ సారస్వత ఝరి ఇది.

శ్రీ సాయుజ్యలహరి ఇది—సేవింపుడయా!

"భగవంతుడైన శ్రీ సత్యసాయి ప్రేమ 'వేయి తల్లుల ప్రేమ' కన్నుల్లో దయ నొలికించి పెదవులలో లయ పలికించి మందహాసంతో హృదయాలను కదిలించి, మధురభాషణంతో జన్మజన్మల అనుబంధాల అనుభూతులను కలిగించి దివ్య స్పర్శతో మనుష్యులను మనీషులుగా మార్చి, అభయహస్తంతో ఆర్తులకు ధైర్యాన్ని కూర్చి, నిరంతరం అపారమైన ప్రేమతో స్వర్ణ రత్న ఆభరణాలను ప్రసాదిస్తూ, నిత్యమూ అలౌకిక ప్రభతో అద్భుతమైన ఆకర్షణతో జనుల మనంబు లేలాడే శ్రీ సత్యసాయి సాక్షాత్తు సౌందర్యలహరి"యే!

అనురాగలహరి సచ్చిదానందలహరి అయిన సత్యసాయి మాతకు శతసహస్ర అభివందనాలను సమర్పిస్తూ సత్యసౌందర్య లహరికి నిత్యసౌందర్యలహరిని భక్తితో అంకితం చేస్తున్నాను!

మంత్రశాస్త్రజ్ఞులు మంత్రశాస్త్రంబని
    తంత్రవాదులు మహాతంత్రమనియు
భక్తులు దేవ్యనురక్తి కావ్యంబని
    సాధకుల్ సాధనాసరణి యనియు
యోగతత్త్వజ్ఞులు యోగశాస్త్రంబని
    కవివరేణ్యులు దివ్యకవితయనియు
చంద్రకళావిదుల్ సకలసంపదలని
    సమయవేత్తలు శాస్త్రసారమనియు

నిత్యపారాయణము సేయు సత్యమైన
తత్త్వగ్రంథమ్ము ఆత్మ సౌందర్యలహరి
శంకరాచార్య కవితాలసత్కుమారి
శంకర మనోహరి కరా ప్రసారలహరి!

జగన్మంగళమైన ఆ భవానీదేవి శక్తిస్వరూపిణి ఆమె పరాశక్తి ఆదిశక్తి ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తియైన మూర్తి గిరినందిని, విశ్వవినోదిని, పరబ్రహ్మరూపిణి సమయాఖ్య అయిన ఆ దేవిని శంకరాచార్యులవారు "సౌందర్యలహరి"గా సంభావించారు

శంకరాచార్యులవారి మేధస్సు జ్ఞానమయం, మనస్సు ప్రేమమయం, శిరస్సు తేజోమయం, వచస్సు కవితామయం! ఆయన అఖండ మేధానిధులలో అద్వితీయుడు, భక్తిరసార్ద్ర హృదయులలో మహనీయుడు, మంత్ర తంత్ర మహిమాన్వితులలో గణనీయుడు

పరమేశ్వరుడు శంకరాచార్యులకు ఈ కావ్యలహరిని అనుగ్రహించాడు అందుకు నందికేశ్వరుడు అద్భుతగిలి 'ఇది మానవ హస్తగతం కారాదు' అని దానిని లాగుకొనబోయాడట అప్పుడు జరిగిన పెనగులాటలో ఆచార్యులవారి చేతికి మొదటి నలుబదియొక్క శ్లోకాలు లభించాయి వాటికే ఆనందలహరి అని పేరు మిగిలిన శ్లోకాలు శంకరులవారు రచించి పూర్తిచేసారని ఐతిహ్యం ఆ దేవీస్తుతిలో పార్వతీదేవి రూపం పరమాద్భుతంగా వర్ణింపబడింది సమస్త కావ్యకళా సంప్రదాయాలను ప్రయోగించటంలో అత్యున్నత శిఖరాలనధిరోహించి శంకరాచార్యులవారు కవిశేఖరులుగా దర్శనమిస్తారు

శంకరుల మాధుర్య సౌందర్యలహరిని అనేకులు విద్వాంసులు, పండితులు, మంత్రశాస్త్రపారంగతులు అనేక విధాలుగా ఉపాసించి ఈప్సితార్థాలు పొందారు ఆ జగన్మాత వారి వారి ఉపాసనలకు తగినట్లు వారికి మనోరథాలను ప్రసాదిస్తున్నది పరబ్రహ్మణి అయిన ఆ దేవిని అధ్యయనం చేయటమే ఆమెను అరాధించటం

నిత్యపావనకరి రమణీయలహరి
అమిత సుఖకరి అందాల అమృతలహరి
కల్పతరుదాన కల్యాణ కౌశలహరి
వందనీయ శ్రీ సచ్చిదానందలహరి !

శంకరాచార్యులవారి ద్వారా నేను ఆ జగన్మాత
చూసి తెలుగుగుండెకు హత్తుకొనేవిధంగా తేటగీతులను
రాజరాజేశ్వరిని సమర్చనచేశాను సామాన్యులకోస
వ్యాఖ్యను పొందుపరచాను సందర్భానుగుణంగా పార్వతీ
స్తుతులనుదాహరించాను సాహితీ మనస్కులు సమీక్షింతురు

ఈ కృతి ఈ విధమైన శుభాకృతి పొందటానికి
[illegible] శ్రీ వెంకటేశ్వరస్వామి సహాయం మరువలేనిది
తిరుపతి దేవస్థానం కార్యనిర్వాహణాధికారికి, సప్తగిరి సం
సహృదయశేఖరులు శ్రీ కాట్రపాటి సుబ్బారావుగారికి
తాభివందనములు

"జయగీతి ని ప్రసాదించిన ప్రేమమూర్తులు మా"
బాబాయిగారికి నా నమస్సులు

ఈ కృతిని ముచ్చటగా ముద్రించి యిచ్చిన
ప్రింటర్స్' మిత్రులకు నా శుభాకాంక్షలు

ఈ సమస్త కార్యలీలాపాలకు సూత్రధారి నాపై
మృత ఆశీర్వాదములను కురిపే లీలామానుషవేషధారి శ్రీ స
భగవంతునికి అనేక కృతజ్ఞతాభివందనాలు సమర్పించుకొంట

**23-2-90**
శుక్ల శివరాత్రి — శా

# అనుక్రమణిక

| శ్లోక సంఖ్య | | | పుట |
|---|---|---|---|
| 85 | నమోవాకం | పాదాబ్జాలు | 178 |
| 13 | నరంవర్షీయాంసం | కరుణాకటాక్షం | 34 |
| 55 | నిమేషోన్మేషాభ్యాం | నిమేషోన్మేషములు | 118 |
| 79 | నిసర్గక్షీణస్య | సూక్ష్మమధ్య | 166 |
| 88 | పదం తే | కాలుత్రొక్కుట | 184 |
| 83 | పరంజేతుం | అమ్ములపొది | 174 |
| 91 | పదన్యాసక్రీడా | హంసపదన్యాసం | 190 |
| 54 | పవిత్రీకర్తుం | వీక్షణాలు | 116 |
| 62 | ప్రకృత్యా | మధురాధరములు | 132 |
| 95 | పురారాతే | పూజాపద్ధతి | 198 |
| 100 | ప్రదీపజ్వాలా | సమర్పణ | 208 |
| 22 | భవాని త్వం | వత్సలత | 52 |
| 68 | భుజాశ్లేషా | కంఠ[illegible] | 144 |
| 44 | భ్రువేభుగ్నే | భ్రూవిలాసం | 102 |
| 35 | మనస్త్వం | విశ్వమూర్తి | 77 |
| 9 | మహీంమూలాధారే | సహస్రారం | 26 |
| 19 | ముఖంబిందుం | కామకళ | 46 |
| 70 | మృణాళీ | మృణాళబాహువులు | 148 |
| 86 | మృషాకృత్వా | ప్రణయకోపన | 180 |
| 77 | యదేతత్కాళిందీ | రోమరాజి | 162 |
| 65 | రణేజిత్వా | ప్రసాదం | 138 |
| 46 | లలాటం లావణ్య | ఫాలబింబం | 100 |
| 74 | వహత్యంబ | ముత్యాలసరాలు | 156 |
| 66 | విపంచ్యా | వాఙ్మాధుర్యం | 140 |
| 53 | విభక్తత్రైవర్ణ్యం | నేత్రత్రయము | 60 |
| 26 | విరించిః | సతీత్వమహిమ | 60 |

| శ్లోక సంఖ్య | | | పుట |
|---|---|---|---|
| 49 | విశాలాకల్యాణీ | సౌందర్యలహరి | 106 |
| 37 | విశుద్ధౌ | విశుద్ధి | 82 |
| 15 | శరజ్జ్యోత్స్నా | కవితాప్రసాదం | 38 |
| 34 | శరీరంత్వం | భైరవీభైరవులు | 76 |
| 32 | శివశ్శక్తిః | పంచదశి మంత్రం | 72 |
| 1 | శివశ్శక్త్యా | శివాశివ స్తుతి | 10 |
| 51 | శివేశృంగారార్ద్రా | రసమయి | 110 |
| 84 | శ్రుతీనాం | శ్రీపాదాలు | 176 |
| 72 | సమందేవీ | తల్లి పాలిండ్లు | 152 |
| 38 | సమున్మీల | అనాహతం | 84 |
| 60 | సరస్వత్యా | పెద్దకుండలములు | 128 |
| 99 | సరస్వత్యాలక్ష్మ్యా | ఫలప్రాప్తి | 206 |
| 17 | సవిత్రీభిర్వాచాం | కవిత్వసిద్ధి | 42 |
| 10 | సుధాధారాసారైః | కుండలిని | 28 |
| 8 | సుధాసింధోర్మధ్యే | చింతామణిగృహం | 24 |
| 28 | సుధామప్యాస్వాద్య | తాటంకమహిమ | 64 |
| 59 | స్ఫురద్గండాభోగ | వదనబింబం | 126 |
| 0 | స్వదేహోద్భూతా | కల్పాంతనీరాజనం | 68 |
| 33 | స్మరంయోనిం | మంత్రోపాసన | 74 |
| 63 | స్మితజ్యోత్స్నా | సుస్మిత | 134 |
| 78 | స్థిరోగంగావర్తః | నతనాభి | 164 |
| 5 | హరిస్త్వామారాధ్య | సేవామహిమ | 18 |
| 76 | హరక్రోధజ్వాలా | సౌందర్యరేఖ | 160 |
| 87 | హిమాని | పాదయుగం | 182 |

ఓం

ఓంకార స్వర మంగళాచరణ మంత్రోద్యన్మహాసుందరీ!
ఐంకారోదిత సామగానరస సత్యానంద రత్నాంబరీ!
హ్రీంకారోజ్వల బీజసంపుట లసత్ ప్రేమైక విద్యాధరీ!
శ్రీంకారోపరి శాంకరీ! సుఖకరీ! శ్రీసత్యసాయీశ్వరీ!

సౌందర్య సుధాలహరీ!
మందార మరంద మంత్ర మందిర మహితా
నందోద్యాన విహారీ!
సందీపనకారి! సత్యసాయి కుమారీ!

"శంకర" "శాంతిశ్రీ"కర
కైంకర్య కళావిలాస కవితా లహరీ
కంకణ నిక్వణ "సమయా"
లంకృత కృతి సుకృతి! చక్ర లలితాకృతియే!

# 1. శివా శివస్తుతి

శ్లోకము

శివ శ్శక్త్యా యుక్తోయది భవతి శక్తః ప్రభవితుం
న చే దేవం దేవో నఖలు కుశలః స్పందితు మపి
అతస్త్వా మారాధ్యాం హరి హర విరించిదిభిరపి
ప్రణంతుం స్తోతుంవా కథ మకృత పుణ్యః ప్రభవతి

పద్యము

శ్రీమహాచక్ర విత్కళా ప్రేమనగరి !
పరమశివసుందరీ ! లోకపావనకరి !
ధర్మసౌవర్ణశిఖరి ! సౌందర్యలహరి !
హరిహరవిరించి సురపూజితాంఘ్రినఖరి !

శివుడు నినుగూడియుంటచే నవయుగాది
సృష్టికి సమర్థుడై సుప్రసిద్ధుడయ్యె
నీవు లేకుండ ఏ మహాదేవునకును
స్పందనంబుండదే శివానందలహరి !
నీకు ప్రణమిల్లి నిన్ను వర్ణింప అకృత
పుణ్యునకు ఎట్లు కావ్యనైపుణ్య మొదవు

సమయతత్వ స్వరూపిణీ ! సరసవాణి !
సర్వశక్తిప్రదాయినీ ! సకల జనని !
శంకరార్చితచరణ ! శ్రీచక్ర శరణ !
వందనమ్ములు తల్లి ! ఆనందవల్లి !

వ్యాఖ్య

అమ్మా! సర్వమంగళా! శివా! సాదాఖ్యా!

నీతో కూడియే పరమశివుడు జగన్నిర్మాణం చేయటానికి సమర్థుడైనాడు తల్లీ! నీవూ నీ శక్తి లేకపోతే శివుడు స్పందింపనైనా స్పందింపలేడమ్మా! లోకంలో సదా హరి హర హిరణ్యగర్భాదులచే నిత్యపూజ లందుకొనే పవిత్ర మాతృమూర్తివైన నీకు మానసికంగా వాచికంగా కాయికంగా నమస్కరించాలి అనుకొన్నా, నిన్ను స్తుతించాలి అనుకొన్నా పూర్వ పుణ్యవిశేషబలం ఉండాలి తల్లీ! ఆ మహాభాగ్యం నాకున్నది కాబోలు నిన్ను స్తుతించగలుగుతున్నాను ఆలకించు తల్లీ!

★ ★

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ।

—కాళిదాసు

# 2. పాదధూళి

తనీయాంసం పాంసుం తవ చరణపంకేరుహ భవం
విరించి స్సంచిన్వన్ విరచయతి లోకా నవికలమ్
వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం
హరః సంక్షుద్యైనం భజతి భస్మోద్ధూళనవిధిమ్

పద్యము

శ్రీమహారాజ్ఞి చిత్కళాప్రేమశిఖరి!
రాజరాజేశ్వరి! శైలరాట్కుమారి!
బాల! నీపాదపంకేరుహాళి ధూళి
కణములోని సహస్రభాగమ్ము గరిమ
మహిమ వర్ణింపవశమె సామాన్యమతికి!

బ్రహ్మదేవుండఖండ తపస్సు చేసి
భక్తి నిసుమంతదాల్చి విశ్వము సృజించు
హరి రవంత వహింప సాధ్యమ్ముకాక
వేయితలల అనంతుడై మోయుచుండు

శివుడొకింత విభూతిగా స్వీకరించి
ఈశ్వరత్వమ్ముబొందు తల్లీ! భవాని!

వ్యా ఖ్య

అమ్మా! భవానీ!

బ్రహ్మదేవుడు నీపాదపద్మరజోకణంలో ఇంచుకంత సంపాదించుకొని తలధరించి ఆ మహామహిమా ప్రభావంతో సర్వశక్తి సంపన్నుడై ఈ పదునాలుగు లోకాలను ఎటువంటి వైకల్యము, సంఘర్షణము లేకుండా చక్కగా సృష్టిస్తున్నాడు తల్లీ! శ్రీ మహావిష్ణువు నీ పాదధూళి మహత్వంవల్లనే శింశుమార రూపంలో ఊర్ధ్వలోకాలు ఏడున్నూ, సహస్రశీర్షుడై శేషాహి రూపంలో అధోలోకాలు ఏడున్నూ రక్షిస్తున్నాడు తల్లీ! పరమశివుడు నీ పాదధూళి మహామహిమాన్వితమని గ్రహించి సౌందర్య సాధనగా దేహానికి అలంకరించుకొని విభూతి సుందరుడై ప్రకాశిస్తున్నాడు సమాధి స్థితిలో విరాజిల్లుతున్నాడు ఈ త్రిమూర్తుల శక్తి సామర్థ్యాలకు విశ్వ పరిపాలనకు నీ పాదధూళి కారణమే సమర్థనీయమై అలరారుతున్నది తల్లీ!

★ ★

అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మ కడుపారడిబుచ్చినయమ్మ తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్

—బమ్మెర పోతన

## 3. చైతన్య సుమాలు

అవిద్యానా మంతస్తిమిర మిహిర ద్వీపనగరీ
జడానాం చైతన్యస్తబక మకరంద స్రుతిఝరీ
దరిద్రాణాం చింతామణి గుణనికా జన్మజలధౌ
నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి

పద్యము

విజయసింహాసనేశ్వరీ విశ్వనేత్రి !
జనని ! నీపాదపద్మరజఃకణమ్ము
ఘోరతరమౌ అవిద్యాంధకారమునకు
విశ్వకళ్యాణ భాస్కరద్వీపనగరి.

బుద్ధిమాంద్య మనుష్య సమూహమునకు
పరమచైతన్యదాన పుష్పరసధార.
హీనతర దైన్యపీడిత మానవునకు
దివ్య చింతామణి వికీర్ణ భవ్యగృహము

చిత్రజననాబ్ధి నిర్మగ్న జీవతతికి
రాక్షసరిపు వరాహదంష్ట్రిమ్ము తల్లి !
కామ్యదాయినీ ! కనకదుర్గాభవాని !
విశ్వమోహినీ ! ఆనంద వేదవాణి !

వ్యాఖ్య

భగవతీ! భారతీ! పార్వతీ!

నీ పాదారవిందంలోని పుష్పాండికణం ఆత్మజ్ఞానంలేని అజ్ఞుని మానసంలోని అజ్ఞానాంధకారాన్ని పోగొట్టటంలో సూర్యదేవుడి సుప్రభాతప్రభా దీపనగరి సుమా! నీ పాదధూళి రజం జడబుద్ధులగు మూర్ఖులకు విజ్ఞానం చైతన్యం జాలువార్చే జ్ఞానానందలహరి తల్లీ!

నీ అడుగుదమ్ముల దుమ్ముకణాలు దరిద్రులకు చింతామణి మందిర శ్రేణులు గదా! నీ పాద మందార రజఃకింజల్కాలు జనన మరణ ప్రవాహ సాగరంలో కొట్టుకొనిపోయే సంసారులకు యజ్ఞ వరాహస్వామి దంష్ట్రిలు గదా తల్లీ! అమ్మా! నీ పదాలు శ్రీ నిల యాలు! షట్కోణ అలంకరణాలు

★ ★

ద్వైపాయనప్రభృతి శాపాయుధ త్రిదివ సోపానధూళిచరణా
పాపాపహస్వ మనుజాపానులీన జనతాపాపనోదనిపుణా
నీపాలయా సురభి ధూపాలకా దురిత కూపాదుదంచయతుమాం
రూపాధికాశిఖరి భూపాలవంశమణి దీపాయితా భగవతీ!

—కాళిదాసు

# 4. చరణాలు

త్వదన్యః పాణిభ్యా మభయవరదో దైవతగణః
త్వమేకా నైవాసి ప్రకటిత వరాభీత్యభినయా
భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాంఛా సమధికం
శరణ్యే లోకానాం తవహి చరణా వేవ నిపుణౌ

పద్యము

నిత్యసద్ధస్వరూపిణీ ! సత్యమూర్తి !
బిందుమండలవాసినీ ! ఇందువదన !
అంబ ! దేవతల్ వరదాభయకరముద్ర
లూని ఆకర్షణముసేయుచుండ ! నిండు
కుండపై అభినయములేకుండ తల్లి !
నీ పదాలు పెక్కుభయాలు బాపి - అర్థు
లడిగినంతకు పెక్కుభాగ్యాల నిచ్చు
ధర్మ సౌవర్ణశిఖరి సౌందర్యలహరి !
మధురతర సుధాసాగర మధ్యవాసి
నీ ! కృపావాహినీ ! జననీ ! నమోస్తు !

వ్యా ఖ్య

లోకైకమాతా ! భక్తజన పారిజాతా !

సాధారణంగా ఇతర దేవతలందరూ చేతులతో అభయ ముద్రలు పట్టి. వరముద్రలు ధరించి ప్రత్యక్షం అవుతున్నారు నీవు మాత్రం, ఓ తల్లీ ! ఏ ముద్రలు పట్టక చిన్ముద్రలో ఉంటావు నీ పదాలు వరప్రదాలు చూస్తే నీ పదాలు రెండే చాలు భక్తులను భయం నుండి రక్షించి కోరినదానికంటె మిక్కిలి వరాలు ప్రసాదించి సర్వసమర్థాలై భక్తకోటికి ఆనందం చేకూరుస్తున్నాయి నీ చరణాలు అతి నిపుణాలు దీనజన శరణాలు భక్తలోక శిరోలంకరణాలు అన్నిటికీ మూల కారణాలు. నీ పాదాలు అష్టదళ పద్మాలు !

★ ★

ప్రాతర్నమామి లలితా చరణారవిందం
భక్తేష్ట దాన నిరతం భవ సింధుపోతం
పద్మాసనాది సురనాయక పూజనీయం
పద్మాంకుశ ధ్వజ సుదర్శన లాంఛనాఢ్యం
—శ్రీ లలితా స్తోత్రం

## 5. సేవా మహిమ

హరి స్త్వా మారాధ్య ప్రణత జన సౌభాగ్య జననీం
పురా నారీ భూత్వా పురరిపు మపి క్షోభమనయత్
స్మరోఽపి త్వాం నత్వా రతినయన లేహ్యేన వపుషా
మునీనా మప్యంతః ప్రభవతి హి మోహాయ మహతామ్

### పద్యము

దేవకార్యసముద్యతా ! దేవవిజిత !
విశ్వకల్యాణకాంక్షతో విష్ణుమూర్తి
తత్త్వపండిత వాంఛితార్థప్రదాలు
నీ పదాలు పల్మార్లు ధ్యానించి తల్లి !
ఒకవిలాసినీమూర్తియై ఒప్పుజూపి
పరమశివుని మనస్సులో మరులుతేపె

మారుడును నీ పదార్చనా కారణమున
రతి మనోహర సౌందర్య రసపరీత
దేహమునుపొంది యోధుడై దిగ్విజయము
సలుపుచున్నాడు ముని మనోబలముచీల్చి

నీ పదార్చనాఫలము వర్ణింప వశమె
నవ్య సుందరతర శివానందలహరి !

వ్యా ఖ్య

ఓ జగన్మాతా ! పరమకరుణా సమేతా ! శ్రీచక్ర స్వరూపిణీ ! జగన్మోహినీ ! భక్తజనులకు ఐశ్వర్యం సౌందర్యం మాధుర్యం ఎన్ని ప్రసాదించావమ్మా ! శ్రీమహావిష్ణువు త్రిపురసుందరీ ప్రస్తారంలో ఋషియై నిన్ను ఆరాధించటంవల్ల గదా ఆ స్వామి మోహినియై కనకస్వామిని వధించటం, ఆ రూపు శివునికి చూపి జితేంద్రియుడైన శివుని మనస్సులో కామవికారాలు కలిగించటం సాధ్యమయింది నీ ప్రసాద మహిమ వర్ణింపతరమా తల్లీ ! మన్మథుడు కూడా ఋషియై శ్రీచక్రార్చన చేయటంవల్లగదా రతీదేవికన్నులకు మిరుమిట్లుగొలిపే దేహసౌందర్యం పొందగలిగాడు ! ఆ రూపసంపదతో కానలలో నివసించే కామనిరోధులైన మునుల మనస్సులలో కామాభిలాష కలిగింపగలిగాడు తల్లీ ! భగవతీ ! నీ కరుణా కటాక్ష ప్రసాదం ఎంత సమర్థమయింది తల్లీ !

★ ★

జగన్మాత ర్మాత స్తవ చరణసేవా నరచితా
నవాద త్తం దేవి ద్రవిణమపి భూయ స్తవమయా
తదాపి త్వం స్నేహం మయి నిరుపమం యత్ప్రకురుషే
కుపుత్రో జాయేత క్వచదపి కుమాతా నభవతి !

—శంకరాచార్య

## 6. దయా మహిమ

ధనుఃపౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచవిశిఖాః
వసంత స్సామంతో మలయమరు దాయోధన రథః
తథాఽప్యేకస్సర్వం హిమగిరిసుతే కామపి కృపాం
అపాంగా త్తే లబ్ధ్వా జగదిద మనంగో విజయతే

పద్యము

శ్రీమహారాజ్ఞి! ఓరదాక్షిణ్యరాశి!
లలిత! శ్రీమాత! నీ కృపాలవముచేత
చెఱకు విల్లును, పువ్వుల శరములైదు
చిన్ని తుమ్మెదనారిని చేతబట్టి
పిల్లతెమ్మెరతేరుపై పేర్మి నెక్కి
ఆమని అమాత్యపీఠమ్మునందు నిలిపి
మూడులోకాల పైబడి దాడిచేసి
బహుమహాత్ముల అతిదృఢ బలముచీల్చి
మారు డీమారు అసహాయశూరుడగుచు
గెలుచుచున్నాడు కవిజన కీర్తనీయ!

వ్యాఖ్య

ఓ హిమాచల సార్వభౌమ కుమారీ !

మన్మథుడిపై ఎంత కరుణ వహించావు తల్లీ ! అతణ్ణి అసహాయ శూరుణ్ణి చేశావు కదా ! అతడు అనంగుడా ! అతని బాణము వాడిపోయే పూవులా ! నారి ఎగిరిపోయే తుమ్మెదలా ! చెలికాడు అల్పకాలం మాత్రం విగిరించే వసంతుడా ! రథం చలించే మలయ మారుతమా ! ఇంత బలహీనుడు యుద్ధానికి ఎందుకు పనికిరాని సామగ్రితో వచ్చి జగదేకవీరుడై ముని జనాలను జయిస్తున్నాడు అంటే ఎంత చిత్రం తల్లీ ! అంతా నీ కృపా విశేషం కాక మరేముందమ్మా !

అవ్యాజకృపామృతవల్లీ ! తల్లీ ! వందనాలు

★ ★

అంబా ! నూపుర రత్న కంకణధరా ! కేయూర హారావళీ
జాజీ చంపక వైజయంతిలహరీ గ్రైవేయ వైరాజితా
వీణాగాన వినోద మండితకరా వీరాసన స్థాయినీ
చిద్రూపా ! పరదేవతా ! భగవతీ ! శ్రీరాజరాజేశ్వరీ !

—అంబాష్టకం

# 7. దే వీ స్వ రూ ప ము

క్వణత్కాంచీదామా కరికలభ కుంభ స్తన నతా
పరిక్షీణా మధ్యే పరిణత శరచ్చంద్రవదనా
ధనుర్బాణాన్ పాశం సృణిమపి దధానా కరతలైః
పురస్తా దాస్తాం నః పురమథితు రాహో పురుషికా

ప ద్య ము

క్వణిత మేఖలాలంకార మణివిభూష!
జంభ దనుజారి మదకుంభికుంభకుచ!
సుభగ సుకుమార సుందర సూక్ష్మమధ్య!
సమయ పూర్ణచంద్రకళా ప్రసన్నవదన!

అబ్జకర! ధనుర్బాణ పాశాంకుశధర!
"సర్వమంగళ భార్య" నాన్ గర్వమంటి
శివుడు ఆనందనాట్యమ్ము సేయునమ్మ!
శంకరానంద తాండవోత్సాహమూల
గర్వకారణభూత! లోకైకమాత!
లలిత కవితా విరాజిత కలిత మాత!
అస్మదీయ మానస వికాసాబ్జపీఠి
ఇంచువేడుక సాక్షాత్కరించు తల్లి!

వ్యా ఖ్య

అమ్మా! నీ అపురూపమైన రూపసౌందర్యంతో ఒక్కసారి ప్రత్యక్షంకా తల్లీ! చూచి తరిస్తాము- కనులు మిరుమిట్లుగొలిపే చిన్ని చిన్ని మణిమంజరుల కాంచీదామం మెరుస్తుండగా- కుంభి కుంభ స్తనాల భారంవల్ల కొంచం ముందుకు వంగినటువంటి, సన్నని నడుము కలిగినటువంటి, పూర్ణ చంద్రబింబం వంటి వదనం కలిగి నటువంటి రూపంతో ప్రత్యక్షంకా తల్లీ! చెఱకువిల్లు పూలబాణాలు పాశం అంకుశం నీ నాలుగు కరకమలాలలో ప్రకాశిస్తుండగా త్రిపురా సుర సంహారకుడగు పరమశివునికి అహంకారామోదాలు కూర్చిన రూప సంపదతో ఒక్కసారి నాకు సాక్షాత్కరించు తల్లీ!

★ ★

సిందూరారుణ విగ్రహాం త్రినయనాం మాణిక్యమౌళి స్ఫుర
త్తారానాయక శేఖరాం స్మితముఖీ మాపీన వక్షోరుహాం
పాణిభ్యా మళిపూర్ణ రత్నచషకం రక్తోత్పలం బిభ్రతీం
సౌమ్యాం రత్నఘటస్థ రక్తచరణాం ధ్యాయేత్పరా మంబికాం!

—అంబికాస్తోత్రం

# 8. చింతామణి మందిరము

సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే
శివాకారే మంచే పరమశివపర్యంకనిలయాం
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్

పద్యము

ఆర్య ! రాగస్వరూప పాశాఢ్య ! దేవి !
వాసవార్చిత ! ఆశ్రిత పారిజాత !
మాత ! మంజుళ మంగళ మంత్రపూత !
అమృతవార్ధిమధ్యామర ద్రుమపరీత !
ఘన మణిద్వీప నీపోపవన సుగంధ
పరమ చింతామణిగణ ప్రబంధగృహ మ
హా శివాకార శయ్యా శివాంకనిలయ !
వందనీయా ! సదా చిదానంద హృదయ !
ఏ మహాపుణ్య గణ్య యోగీంద్రవరులో !
ఎంత ధన్యులో నిన్ను దర్శింపగలరు !
నీ పదాంబుజ ద్వయము ధ్యానింపగలరు !
నవనవోజ్వల మూర్తి ! ఆనందలహరి !

వ్యాఖ్య

అమ్మా ! నీ స్థానం వర్ణింపతరమా ! సుధాసింధువు మధ్య గల రత్నాల దీవిలో కల్పవృక్షాలు కడిమివృక్షాలు గల వనంలో చింతా మణి మందిర నగరిలో త్రికోణయుతమైన శక్తిరూపమైన మంచంపై పరమశివరూప శయ్యపై నిరతిశయ పరమ సుఖప్రవాహంలో తేలి యాడు తల్లీ ! ఆ సమయంలో నీ అనుగ్రహం పొందిన కొందరు పుణ్యాత్ములు మాత్రమే నిన్ను సేవింపగలరు అందరికీ నీ సేవ లభ్యం కాదుగదా ! మాతా ! నమస్కృతులు తల్లీ !

సమయాచార తత్పరులగు శ్రీ శంకరాచార్యులవారు సాధ కునికి శ్రీ చక్రార్చన విధానం సూచిస్తున్నారు శ్రీ చక్రానికి వియ చ్చక్రం అనికూడా పేరు దహరాకాశజం, బాహ్యాకాశజం అని ఈ వియత్చ్రజ రెండు విధాలు సుధాసింధువు బిందుస్థానం - పంచ యోనులు కల్పవృక్షాలు, కదంబాలు - వీటిమధ్య మణిమంటపం ఈ చింతామణిమందిరం దేవమందిరం ఆ మందిరంలో శక్తి పర్యంకమంచం- దానిపై శయనమై మహేశ్వరుడు, తాంబూల పశ్చారమై ఇంద్రుడు, ఇతర సేవకులై బ్రహ్మాదులు సేవలు అందిస్తున్నారు అచ్చట పర మానందామృతం పొందుతూ సౌందర్యలహరియై విరాజిల్లుతున్నది పరమేశ్వరి శ్రీదేవి—

## 9. సహస్రారము

మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుత మాకాశ ముపరి
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కులపథం
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసే

పద్యము

షోడశాక్షరీమధ్య విశుద్ధమూర్తి!
భూమి వీవు మూలాధారమునకు తల్లి!
అనల మీవు స్వాధిష్ఠానమందు దేవి!
అంబ! మణిపూరమందుదకంబు నీవు
అనిలతత్త్వమ్ము నీవనాహతమున హృది
గగన మీవె విశుద్ధచక్రమ్మునందు
మనసు వీవె ఆజ్ఞాచక్రమున - సుషుమ్న
పథముదాటి సహస్రార పద్మబిందు
వందు పతిదేవుతోడి సాదాఖ్య కళల
సకల మీవుగా విహరించు శక్తి వీవు
యోగిమానస జ్యోతివై ఊర్ధ్వగమన
వై - ప్రకాశింతు వీవు ఆర్యా! భవాని!

వ్యాఖ్య

అమ్మా! నీవు షట్చక్రోపరి సహస్రార క్రీడావినోదినివి తల్లీ! మూలాధారం ప్రథమ కమలం ఈ మూలాధారచక్రంలోని పృధివీ తత్త్వాన్నీ - స్వాధిష్ఠానం రెండవ కమలం ఇది రుద్రగ్రంథి దీనిలోని అగ్నితత్త్వాన్నీ - మణిపూరకం మూడవ కమలం ఇది మణులతో అలంకృతం. అందుకని దీని పేరు మణిపూరకం అన్నారు దీనిలోని ఉదకతత్త్వాన్నీ - అనాహతం నాల్గవ కమలం ఇది నాదస్థానం ఇందులోని వాయుతత్త్వాన్నీ - విశుద్ధం అయిదవ కమలం ఇది శుద్ధ స్ఫటికం దీనిలోని ఆకాశతత్త్వాన్నీ - ఆజ్ఞాచక్రం ఆరవ కమలం భ్రూమధ్యం దీని స్థానం ఇది జ్ఞానస్థానం దీనిని బ్రహ్మగ్రంథి అంటారు దీనిలోని మనస్తత్త్వాన్నీ - దాటివెళ్ళి నీవు సుషుమ్నా మార్గం ఛేదించుకొని "సహస్రార కమలం లో సదాశివుడితో క్రీడిస్తూ ఉంటావు నీవు సాదాఖ్యవు తల్లీ ఇరువదినాలుగు తత్త్వాలు అతిక్రమించి పంచవింశతత్త్వవధారుడైన సదాశివునితో కూడి షడ్వింశతి తత్త్వస్వరూపిణివై పరమాత్మవై ప్రకాశించే భగవతీ నీకు నమస్సులు తల్లీ!

 

సహస్ర పరమాదేవీ శతమూలా శతాంకురా
సర్వాగుం హరతు మే పాపం దూర్వా దుస్స్వప్ననాశనీ!

—శ్రీసూక్తం

# 10. కుండలిని

సుధాధారాసారైః చరణయుగళాంతర్విగళితైః
ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయ మహసః
అవాప్య స్వాం భూమిం భుజగనిభ మధ్యుష్టవలయం
స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి

పద్యము

త్రిపురసుందరీ ! భవదీయ దివ్య సవ్య
సుందర పదారవింద నిష్యంద మధు మ
రంద పీయూష హర్ష వర్షంబుచేత
డెబ్బదియు రెండువేల నాడీ లతాళి
కాలవాల ప్రపంచ దేహమ్మునెల్ల
ఆర్ద్రమొనరించుచుందువు అంత మరల
ఘన రసామ్నాయ కౌముదీ కాంతినుండి
పాముపలె చుట్టుకొనెడి రూపమ్ము పొంది
శ్రీసహస్రార కమల కర్ణికకు నడుమ
సూక్ష్మరంధ్రమ్ములోనుండి శోణిత త్త్వ
కుండలిని శక్తివై నిద్రగొందువమ్మ !
ఊర్ధ్వముననుండి క్రమముగా ఉర్వితత్త్వ
మునకు దిగివచ్చుచుండు యోగినివి నీవు
దర్శనవిహారి ! దివ్య సౌందర్యలహరి !

వ్యాఖ్య

అమ్మా! నీ పాదారవింద మరంద నిష్యంద ధారలచేత సాధకుని శరీరంలోని డెబ్బదిరెండు కాలనాడీ మార్గాలను తడుపుతున్నావు తల్లీ! అమృతస్థానీయుడైన చంద్రుని వీడి స్వస్థానంలోని ఆధారచక్రం మరల పొంది అందు స్వస్వరూపంలో సర్పంవలె కుండలాకారం పొంది పద్మకర్ణిక మధ్యలోని మిక్కిలి సూక్ష్మరంధ్రంలోని పృధ్వీతత్త్వమునందు కుండలినివై విశ్రాంతి తీసికొనే తల్లీ నీకు నమస్సులు!

★ ★

షడాధార పంకేరుహాంతర్విరాజ త్సుషుమ్నాం
తరాశేషు తేజోల్లసంతీం
పిబంతీం సుధామండలిం ద్రావయంతీం సుధామూర్తి
మీడే మహానందరూపామ్!

—భవానీ స్తోత్రం

## 11. శ్రీ చక్రము

చతుర్భిః శ్రీకంఠైః శివయువతిభిః పంచభిరపి
ప్రభిన్నాభిః శంభో ర్నవభిరపి మూలప్రకృతిభిః
చతుశ్చత్వారింశ ద్వసుదళ కలాశ్రత్రివలయ
త్రిరేఖాభి స్సార్థం తవ శరణ కోణాః పరిణతాః

పద్యము

లలిత ! శ్రీమాత ! రుద్రమూర్తులు నలువురు
ఇతర శివశక్తులేవురు - అతి మహితులు
మూలప్రకృతులు నవసంఖ్య - ముఖ్యభటులు
అష్ట షోడశ దళముల అధిపసింప
మేఖలాత్రయ భూపుర రేఖలుగల
నలుబదియునాల్గు భవ్య కోణములతోడ
వెలయు శివశక్తిరూపక నిలయమైన
నీదు శ్రీచక్ర నగరి వర్ణింప వశమె !

వ్యాఖ్య

అమ్మా! డెబ్బదిరెండువేలు గల మా నాడీమండలాలన్నీ అమృతసేచనం చేసి మా హృదయపీఠంపై అధివసించు తల్లీ! నీ జ్ఞానం నన్ను వీడకుండుగాక! సాయుజ్యం ప్రసాదించు ప్రసన్న రూపిణీ! నీ శ్రీచక్రనగరి నిర్మాణచాతురి బహుధా ప్రశంసనీయం కదా! ఈ శ్రీచక్రమే మానవదేహం - చరాచరజగత్తు జగదుత్పత్తికి మూలకారణాలైన నవయోని చక్రాలు ఇందు విలసితాలు దీనిలో నాలుగు శ్రీకంఠచక్రాలు, అయిదు శక్తిచక్రాలు నిర్మితాలు - ఈ నవ యోనులనే నవధాతువులంటారు ఇవే మూలప్రకృతులు పదియవ యోని ఈశ్వరి చర్మం రక్తం మాంసం మెధ అస్థి ఇవి పంచభూత శక్తి మూలకాలు మజ్జ వీర్యం ప్రాణం జీవం ఈ మాయాదులు శివ మూలకాలు పదియవ యోని బైందవస్థానం ఇది అన్నిటికీ మూలం ఇదే పరాశక్తి ఈశ్వరి ఈ చరాచర జగత్తు యావత్తు శివశక్తి మయం శ్రీచక్రం స్థూలంగా బిందువు, త్రికోణం, అష్టకోణం, దశదళాలు రెండూ, చతుర్దశదళం, అష్టదళం, షోడశదళం, త్రివలయం, భూపురం కలిగి నలుబదినాలుగు కోణాలతో నాలుగు ద్వారాలతో విరాజిల్లుతూ ఉంటుంది సమయాచారపరంగాను, కౌళాచారపరంగాను ఈ శ్రీచక్ర నిర్మాణం ద్వివిధం

# 12. సౌందర్యదీప్తి

త్వదీయం సౌందర్యం తుహినగిరికన్యే తులయితుం
కవీన్ద్రాః కల్పంతే కథమపి విరించి ప్రభృతయః
యదాలోకౌత్సుక్యా దమరలలనా యాంతి మనసా
తపోభిః దుష్ప్రాపామపి గిరిశ సాయుజ్య పదవీమ్

పద్యము

హైమగిరిసార్వభౌమ సంప్రేమపుత్రి !
సర్వమంగళ ! మాధురీ సారతరము
నిరుపమానమ్ము అతిరమణీయమైన
నీదు సౌందర్య దీప్తి వర్ణించి పలుక
బ్రహ్మదేవాది కవుల తరమ్మ తల్లి !

దేవతాస్త్రీలు నీ చారుదీప్తి లవము
దర్శనముసేయ తపియించి తరముకాక
భవుని సాయుజ్యపదమును భావమందు
అందుకొనగోరుచున్నారు ఇందువదన !

వ్యాఖ్య

హిమగిరి రాజకుమారీ! నీ సౌందర్య మాధుర్యం అనుపమానం అనిర్వచనీయం వాణీనాథ లక్ష్మీనాథ ప్రభృతి విద్వాంసులైన కవివరేణ్యులు నిన్ను వర్ణింపలేకున్నారు తల్లీ! ,,ఎం సివే సాటి దేవతాస్త్రీలు నీ సౌందర్య సందర్శనాపేక్షతో ఎచ్చి చూచి వారి సౌందర్యం నీ ముందు ఒక్కింత కూడ సరిరాకపోయేసరికి వారు కృచ్ఛ్రి చాంద్రాయణాది తపములచేత కూడా నీ అందం పొందరానిదై మానసికంగాను శారీరకంగాను తపించిపోతున్నారు తల్లీ! అప్సరసలు నీ సౌందర్యం ఆస్వాదించాలని పుంభావాన్ని కోరుతున్నారు అందునా ఇతర పురుషులకు నీ సౌందర్యం దర్శింప శక్యం కాదని, నీ లావణ్యం పరమేశ్వరు డొక్కడికే ఆస్వాద సాధ్యమని, దుర్లభమైన సదాశివ తత్వాన్ని ఉపాసిస్తున్నారు

★ ★

సౌందర్యలహరీం దేవీం మందహాస మనోహరీం
ఆనందకోశ సంచారం సాయిం వందే మహేశ్వరీమ్

—శాంతిశ్రీ

## 13. కరుణా కటాక్షము

నరం వర్షీయాంసం నయనవిరసం నర్మసు జడం
తవాపాంగాలోకే పతితమనుధావంతి శతశః
గళద్వేణీబంధాః కుచకలశ విస్రస్త సిచయాః
హఠాత్త్రుట్యత్కాంచ్యో విగళిత దుకూలా యువతయః

పద్యము

వృద్ధుడై బ్రాసి రూపవిహీనతముడు
మరియు సంసారమున రసమర్ధజనుఁడు
నీ కటాక్షమ్ము వానిపై సోకినంత
మన్మథుండయి బాధించు మానినులను
దేవ గంధర్వ నవయువతీజనమ్ము
పరుగులెత్తును వాని సంపర్కమునకు
ప్రజయు ప్రభువుగా వాని గౌరవముసేయు
ఎన్ని అద్భుతమ్ములను చూపింతువమ్మ!

వ్యాఖ్య

అమ్మా! నీ కరుణాకటాక్ష పాత్రుడైన మనుష్యుడు ఎంత ముదుసలి అందవికారుడు శృంగార క్రీడా మూఢుడైనా సహస్రాధిక నవ యువ్వనాంగులకు మహా సౌందర్యవంతుడుగా కనిపిస్తాడుట వారు ఆ పురుషుని చేరటానికి కుతూహలాయత్తచిత్తలై వస్త్రాలు జారిపోతుండగా పరుగులు తీస్తారుటమ్మా పాపం నీ కృపా మహిమ, నీ లీల అటువంటిది

★ ★

ప్రసూనశర పంచక ప్రకటు జృంభణా గుంఫితం
త్రిలోక మవలోకయం త్వమల చేతనా చింతయన్
అశేష రమణీజన స్మర విజృంభణేయ స్సదా
పటుర్భవతి తే శివే త్రిజగ దంగనా క్షోభణే

—దేవీమహిమ్న స్తోత్రం

# 14. శ్రీపదము

క్షితౌ షట్పంచాశ ద్ద్విసమధిక పంచాశదుదకే
హుతాశే ద్వాషష్టి శ్చతురధిక పంచాశ దనిలే
దివి ద్విష్షట్త్రింశ న్మనసి చ చతుష్షష్టి రితి యే
మయూఖాస్తేషా మప్యుపరి తవపాదాంబుజ యుగమ్

## పద్యము

భగవతీ! భారతీ! సదా భాసురమతి!
యోగి దేహమ్ములో శ్రీమయూఖరుచులు
జ్ఞ తలంపు మూలాధార చక్రమందు
ఏబదా రంబు మణిపురి నేబదిదుగ-
అగ్నిపైని స్వాధిష్ఠానమందు అరువ
దిదుగ - మరుదనాహతిని నేబదియునాల్గు-
పరమ గగనవిశుద్ధి డెబ్బదియు రెండు-
నవమనసి ఆజ్ఞ అరువదినాల్గు రుచుల
పై సహస్రారచక్రమ్ముపై సుధాంశు
బింబ సహజ బైందవ సుధాబ్ధికిని ఉపరి
తత్త్వవిద్యాకుమారి సౌందర్యలహరి!
నీ పదాంభోరుహము దర్శనీయమమ్మ!

వ్యాఖ్య

అమ్మా! నీ కాంతిచేత విశ్వం భాసిస్తున్నది అనంతకోటి కాంతి కిరణాలు నీ పాదాంబుజాలనుండి ప్రసారం అవుతున్నాయి అందులో ముఖ్యంగా మూడు వందల అరువది కిరణాలతో కాలచక్రం దొర్లుతున్నది తల్లీ! నీ భక్తుడైన సాధకుని దేహంలో అండే పిం. బ్రహ్మాండంలో ఇలా ప్రసారమవుతున్నాయి మూలాధారం నుండి ఏబది ఆరు. జలతత్త్వంతో కూడిన మణిపూరకం నుండి ఏబది రెండు. అగ్నితత్త్వంతో గూడిన స్వాధిష్ఠానం నుండి అరువదిరెండు. వాయు తత్త్వంతో కూడిన అనాహతం నుండి ఏబదినాలుగు. ఆకాశతత్త్వంతో కూడిన విశుద్ధచక్రం నుండి డెబ్బది రెండు. మనస్తత్త్వంతో కూడిన ఆజ్ఞాచక్రం నుండి అరువది నాలుగు. వీనికి పైన సహస్రారం నడుమ చంద్రబింబ స్వరూపమైన బైందవం అనే సుధా సింధువుపై నీ పాదాలు ప్రకాశిస్తున్నాయి తల్లీ!

★ ★

యోగానందకరీ! రిపుక్షయకరీ! ధర్మైక నిష్ఠాకరీ!
చంద్రార్కానల భాసమానలహరీ! త్రైలోక్య రక్షాకరీ!
సర్వైశ్వర్యకరీ! తపఃఫలకరీ! కాశీపురాధీశ్వరీ!
భిక్షాందేహి కృపావలంబనకరీ! మాతాన్నపూర్ణేశ్వరీ!

—అన్నపూర్ణాష్టకం

## 15. కవితా ప్రసాదము

శరజ్జ్యోత్స్నా శుద్ధాం శశియుత జటాజూట మకుటాం
వరత్రాసత్రాణ స్ఫటిక ఘుటికా పుస్తకకరామ్
సకృన్నత్వా నత్వా కథమివ సతాం సన్నిదధతే
మధుక్షీర ద్రాక్షా మధురిమ ధురీణాః ఫణితయః

### పద్యము

శుభ్రతర శరజ్జ్యోత్స్నా విశుద్ధదేహ !
చంద్రరేఖా విభూషిత చారుమకుట !
మానసమ్మున నిన్నొకమారు తలచి
గంటమూనిన చిన్నారి కవితలోన
స్వచ్ఛ ద్రాక్షాగుచ్ఛ రసాలు పొంగ
క్షీర మధుధార లుప్పొంగు సిరిచెలంగు
స్ఫటికమాలాభయ వరదపద్మహస్త
ఓ మదంబ ! నా హృది నిల్చియుండుమమ్మ !

వ్యాఖ్య

అమ్మా! శరత్కాలా స్నిగ్ధ ముగ్ధ మోహనాంగి! పూర్ణ చంద్ర చంద్రికా సదృశ లలిత లావణ్య మాణిక్య రుచిర దేహా! నవ బాలారుణారుణ కల్యాణమూర్తి! త్రినయనా! క్షీరాంబుధి జాతా! పరమపునీతా! మాతా! నీ సౌందర్యం వర్ణింపతరమా! తల్లీ! కల్ప వల్లీ! నీ కిరీటం ప్రక్క శశిరేఖ శిరోలంకరణమై సురుచిర సుకుమార కౌముదీ ప్రభలు చిందిస్తున్నది తలపూవుగా నోయిగాలు జాలువారు స్తున్నది కామితాలిచ్చే వరముద్రతో- భయాలు పోగొట్టే అభయ ముద్రతో- అక్షమాలతో విద్యాముద్రతో ఆగమ పుస్తకరాజంతో పాశాంకుశాలతో ధనుర్బాణాంతో విరాజిల్లే అష్టబాహువుల తల్లి! ఏ కవి నిన్ను మనస్సులో తలంచి కవిత కుపక్రమించినా మందార మరంద ధారలు, గోక్షీరధారలు, కదళీ ద్రాక్ష రసాలు ఖండశర్కర మాధుర్య సౌందర్యాలు అతడి కావ్యంనిండా జేరిపోతాయి అతడు పుంభావ శారదామూర్తియై సరస శృంగార కవితా మాధురీ విలాసాలు చూపి రాజసభాంగణాలలో విజయశ్రీలు అందుకొంటాడు ఇదంతా నీ కృపా కటాక్ష విశేషం కదా జననీ!

★ ★

జయ మాతంగతనయే! జయ నీలోత్పలద్యుతే!
జయ సంగీతరసికే! జయ లీలాశుకప్రియే!

—కాళిదాసు

## 16. అ రు ణ

కవీంద్రాణాం చేతః కమలవన బాలాతప రుచిం
భజంతే యేస న్తః కతిచి దరుణామేవ భవతీం
విరించి ప్రేయస్యా స్తరుణతర శృంగారలహరీ
గభీరాభిర్వాగ్భిః విదధతి సతాం రంజనమమీ

### ప ద్య ము

సుకవి కమలాకరోదయ సూర్యరశ్మి !
"అరుణ 'శుభనామ్ని ! కవులు నిన్నాత్మ తలచి
ప్రస్తుతియొనర్చి అమ్మ ! పుంభావపూర్ణ
శారదామూర్తులట్లు తేజరిలగలరు-
సరస శృంగారలహరీ ప్రసన్న మధుర
గుణ చమత్కార ధీర భాషణలతోడ
సకల పండిత రాజేంద్ర సాహితీ స
భా జనమ్ముల నానందపరవగలరు !

వ్యాఖ్య

కవితా కల్పలతికా! వర్ణాత్మికా! భగవతీ! భారతీ! సరస్వతీ! మాతృకాస్వరూపిణీ! కవీశ్వర హృదయాలకు నీ రూపారుణ కాంతి సూర్యరశ్మియై ప్రఫుల్ల శక్తినిస్తుంది నిన్ను అరుణగా ధ్యానించి కదా కవీంద్రులు నీ చరణాలను ఆరాధిస్తారు నలువరాణీ! నీ కరుణామృత వీచి సోకిన కవిచంద్రుల వాగ్విలాస మాధురీలహరీ వీచికలు నర్మగర్భితములై రసభావ బంధురములై సుజనహృదయ రంజాకాలై ప్రకాశిస్తాయి కదా!

★ ★

అరుణాం కరుణాతరంగితాక్షీం
ధృత పాశాంకుశ పుష్పబాణచాపాం
అణిమాదిభి రావృతాం మయూఖై
రహ మిత్యేవ విభావయే భవానీమ్

# 17. కవిత్వ సిద్ధి

సవిత్రీభిర్వాచాం శశిమణి శిలాభంగరుచిభిః
వశిన్యాద్యాభిస్త్వాం సహజనని సంచింతయతి యః
స కర్తా కావ్యానాం భవతి మహతాం భంగి రుచిభిః
వచోభి ర్వాగ్దేవీ వదనకమలామోద మధురైః

పద్యము

భగవతీ! సుధాభారతీ! పార్వతీ! సు
రాద్యమర యోగి వినుత పాదారవింద!
తమ వాగ్రచనా కారణమ్ములైన
చంద్రమణిశిలాశకల రుక్కాంతులవంటి
దేహులగు వశిన్యాద్యష్ట దేవతాళి
మరియు ద్వాదశ యోగినీ మాతృకాళి
పలుకుపు మ్మదు గంధాంఘ్రియుగు గలట్టి
నీ స్వరూపమ్ము మదిని ధ్యానించి సుకవి
వ్యాస వాల్మీకి కాళిదాసాదులయుల
ప్రణయ సౌందర్యలహరీ విరాజమాన
బ్రహ్మ వాణీ మనోజ్ఞ సంభావ్య దివ్య
కావ్య రచనకు దక్షుడై గ్రాలునమ్మ!

వ్యాఖ్య

అమ్మా! త్రిపురసుందరి! వాగధీశ్వరీ! నీ భగవతీరూపం ఇలా ధ్యానిస్తున్నాను. పంచాశద్వర్ణాత్మికవు అష్టవర్ణాత్మికవు అయిన నీయందు చంద్రకాంతమణి శకల లావణ్య దేహులైన దేవతలు ప్రకాశిస్తున్నారు. వశిన్యాదులు ఎనిమిది మంది, యోగిన్యాదులు పన్నెండుగురు, గంధాకర్షిణి మొదలైనవారు నలుగురు. ఇది నీ సారస్వత రూపం.

వశిన్యాదులు ఎనిమిది మంది—

| | | |
|---|---|---|
| అ నుంచి అః వరకు | ప్రథమ వర్గము | |
| క వర్గము | ద్వితీయ వర్గము | కామేశ్వరీశక్తి |
| చ వర్గము | తృతీయ వర్గము | మోదినీశక్తి |
| ట వర్గము | చతుర్థ వర్గము | విమలాశక్తి |
| త వర్గము | పంచమ వర్గము | అరుణాశక్తి |
| ప వర్గము | షష్ఠ వర్గము | జయినీశక్తి |
| యరలవలు | సప్తమ వర్గము | సర్వేశ్వరీశక్తి |
| శషసహాళలు | అష్టమ వర్గము | కౌలినీ శక్తి |

విద్యాయోగిని రేచికాయోగిని, మోచికాయోగిని, అమృతాయోగిని, దీపికాయోగిని జ్ఞానయోగిని ఆప్యాయనీయోగిని, వ్యాపినీ యోగిని, మేధాయోగిని, వ్యోమరూపాయోగిని, సిద్ధరూపాయోగిని, లక్ష్మీయోగిని వీరు పన్నెండుగురు యోగినీ దేవతలు గంధాకర్షిణీ, రసాకర్షిణీ, రూపాకర్షిణీ, స్పర్శాకర్షిణీ నలుగురు నాలుగు ద్వారాలలో నిలిచియున్నారు వీరితో కూడిన నీవు త్రిపురసుందరీ దేవతవు తల్లీ! ఇలా నీ భగవతీ స్వరూపం ధ్యానించినవారు మహాకవులతో సమానంగా వాగ్దేవీ ముఖకమలామోదితమైన కవితలల్లగలరు

## 18. అరుణప్రభ

తనుచ్ఛాయాభిస్తే తరుణ తరణి శ్రీసరణిభిః
దివం సర్వాముర్వీ మరుణిమ నిమగ్నాం స్మరతి యః
భవంత్యస్య త్రస్యద్వనహరిణ శాలీన నయనాః
సహోర్వశ్యా వశ్యాః కతికతి న గీర్వాణ గణికాః

పద్యము

నవనవోజ్జ్వల మధుర సౌందర్యలహరి !
దాంబభాను ప్రభారుణజాలకాభ
సదృశ యుష్మత్తనూద్భవ చ్ఛటలలోని
అరుణిమాంబుధి బంగారు అలలలోన
భూనభోంతరాళంబెల్ల ముదముతోడ
తానమొనరించుచుండ శ్రీసాధకులకు
సారసాత్మలో విశ్వదర్శనమునిచ్చి
తేజరిలుచుందువమ్మ జ్యోతిస్స్వరూప !
నీ విరాడ్రాగరుచిని ధ్యానించువాని
కెవరు వశవర్తులై చరియింపరమ్మ ?
విజిత హరిణేక్ష చకిత ప్రవృత్త విభ్ర
మాప్సరోర్వశీ జనములే యగునుగాక !

వ్యాఖ్య

అమ్మా! అరుణా! సౌందర్యమయమైన నీ శరీరం నుంచి ఉదయించే బాలభానుని కాంతి పుంజాలు అనంతంగా వెల్లువికి వస్తున్నాయి అ అరుణకాంతి వాహినిలో ఈ భూమ్యాకాశాలు మొత్తం మునిగిపోయి బంగరు తళతళలతో విశ్వమంతా దేదీప్యమానంగా కనిపిస్తున్నది ఇలా నీ రూప సౌందర్య మాధుర్యాలను ధ్యానించే సాధకుడికి అప్సరసాది దేవతాకాంతలు కూడా వశులే కదా నీ కారుణ్యరస మహత్వం అనితర సాధ్యం తల్లీ!

★ ★

శ్రీమాత స్త్రిపురే పరాత్పరతరే దేవి త్రిలోకీ మహా
సౌందర్యార్ణవ మంథనోద్భవ సుధా ప్రాచుర్య వర్ణోజ్జ్వలం
ఉద్యద్భాను సహస్ర నూతన జపాపుష్పప్రభం తే వపుః
స్వాంతే మే స్ఫురతు త్రిలోకనిలయం జ్యోతిర్మయం వాఙ్మయం
—దుర్వాస మహర్షి

## 19 కామకళ

ముఖం బిందుం కృత్వా కుచయుగ మధ స్తస్య తదధో
హరార్ధం ధ్యాయేద్యో హరమహిషి తే మన్మథకలామ్
ససద్యః సంక్షోభం నయతి వనితా ఇత్యతి లఘు
త్రిలోకీ మప్యాశు భ్రమయతి రవీందు స్తనయుగామ్

### పద్యము

ఇందు బింబాననము బిందువందు నిలిపి-
కుంభికుంభ స్తనయుగమ్ముగూర్చి - దిగువ
మనసిజ గృహ మ్మథోభాగమున లిఖించి -
భగవతీ! కామబీజ జపమ్మొనర్చు
సాధకుడు తాను తలచిన చపలనేత్ర
చిత్త సంక్షోభమొందించు శీఘ్రగతిని
స్తనయుగమ్ముగా రవిశశి ద్వయము దాల్చి
స్త్రీమహామూర్తివలె ప్రకాశింపుచుండు
ముజ్జగమ్మును ఒకసారి మోహపెట్టు
నమ్మ! వాడు నీదు కృపాలవమ్ముచేత!
పార్వతీదేవి! ఓ మదంబా! భవాని!

## వ్యాఖ్య

అమ్మా! భవానీ! వరదాయినీ! భక్తుడు కామినీమానసాసక్తుడై నిన్ను వేడుకొంటే చక్కగా కరుణిస్తావు ఆతడు మూడు లోకాలను ఏక స్త్రీమూర్తిగా ఊహ చేస్తాడు సూర్యచంద్రులనే చనుగవగా భావన చేస్తాడు ముఖస్థానంలో బిందుకల్పనచేసి దిగువ స్తనయుగం చిత్రించి దానికి దిగువ త్రికోణం లిఖించి అందు కామ బీజాక్షరాలనుంచి అరుణను ధ్యానంచేస్తాడు అప్పుడు నీ మహిమవలన వాడు మూడు లోకాలను వశం చేసికొంటాడు

★ ★

యా విద్యా శివకేశవాది జననీ యావై జగన్మోహినీ
యా బ్రహ్మాది పిపీలికాంత జగదానందైక సంధాయినీ
యా పంచ ప్రణవద్విరేఫదళినీ యా చిత్కళామాలినీ
సా పాయా త్పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ।

## 20. బా దో ప శ మ న ము

కిరంతీ మంగేభ్యః కిరణనికురుంబామృతరసం
హృది త్వా మాధత్తే హిమకర శిలామూర్తి మివ యః
స సర్పాణాం దర్పం శమయతి శకుంతాధిప ఇవ
జ్వరప్లుష్టాన్ దృష్ట్యా సుఖయతి సుధాధార సిరయా

ప ద్య ము

అమృతవర్షిణీ! భక్తప్రహర్షిణీ! సు
ధాంశు భూషణీ! నిన్ను మనోజ్ఞమందు
చంద్రమణిసుధాప్రతిమగా సంస్మరించి
సాధనముసేయు పండితసత్తముండు
గరుడుడై హరించు మహోరగముల బాధ -
జ్వరముపోగొట్టు - జనులకు వ్యథలుమాన్పు -
ఒక్క చల్లనిచూపుచే ఓ మదంబ!
అమృతధారలు వర్షింప నర్హుడగుచు -

వ్యాఖ్య

అంబా! శాంభవీ! నీ సర్వావయవాలనుండి కాంతి చంద్రికలు ప్రసరిస్తూ అమృతం జాలువారుతూ ఉంటుంది తల్లీ! చంద్రకాంత మణినిర్మితమైన నీ లలిత లావణ్య ప్రతిమా రూపాన్ని, హృదయ పద్మంలో నిల్పుకొన్న భక్తుడు విషసర్పాలకు గరుత్మంతుడై వెలుగొందుతాడు కదా తల్లీ! అతని చూపులనుండి అమృతధారలు ప్రవహిస్తుంటాయి ఆ వీక్షణాలు దుఃఖహరాలు సుఖకరాలు

★ ★

చితాభస్మాలేపో గరళశమనం దిక్పటధరో
జటాధారీ కంఠే భుజగపతిహారీ పశుపతిః
కపాలీ భూతేశో భజతి జగదీశైకపదవీం
భవాని త్వత్పాణిగ్రహణ పరిపాటీ ఫలమిదమ్

—శంకరాచార్య

## 21. సాదాఖ్య కళ

తటిల్లేఖా తన్వీం తపనశశి వైశ్వానరమయీం
నిషణ్ణాం షణ్ణామప్యుపరి కమలానాం తవ కలామ్
మహాపద్మాటవ్యాం మృదితమలమాయేన మనసా
మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీమ్

పద్యము

హే దయామయీ! జ్యోతిర్మయీ! త్రయీ! అ
చలిత సౌదామినీగాత్ర! నళిననేత్ర!
షట్కమల శిఖరోపరి శతసహస్ర
పద్మదళ కర్ణికాసన! బైందవీ క
ళా కలాప! సాదాఖ్య! కల్యాణచాప!
సకలజనయిత్రి! మిన్నమస్కారశతము

కామమదమోహ మాయావికారరహిత
మానస జ్ఞాన యోగీంద్రమాన్యులెవరో
హ్రీం త్రయ సహిత వలయిత యంత్రరూప!
నిన్ను దర్శించి సాదాఖ్య! నిరుపమాన
నిర్మల సుధాలహరి నీది - నిరతిశయ మ
హా సుఖాహ్లాద మాధుర్య మానగలరు!

వ్యాఖ్య

అమ్మా ! సాదాఖ్యా ! భగవతీ ! పార్వతీ !

నీ నోయగం హృదయంగమం నీ రూపం విద్యుల్లేఖా ప్రభా భాసురం. నీ తత్వం అతి సూక్ష్మం అదిక్షణప్రభ అది జ్యోతి స్వరూపం మూలాధారం స్వాధిష్ఠానం మణిపూరం అనాహతం విశుద్ధం ఆజ్ఞాచక్రాలకుపైన సహస్రదళ కమలవనంలో మధ్య కమల కర్ణికపై నీ సాదాఖ్యబైందవీ కళాజ్యోతి ప్రకాశిస్తూ ఉంటుంది ఆ జ్యోతిస్వరూపాన్ని నిర్మల నిష్కళంక నిష్కామ మానసంతో విద్యా స్నేహాది అహంకార దూరులైన యోగులు దర్శిస్తారు ఆ సాదాఖ్య సుధారసధారలను అనుభవిస్తారు నిరతిశయ సుఖాన్ని ఆస్వాదిస్తారు పరమానందలహరిని హృదయంలో దర్శిస్తారు ఇది నీ కృపాప్రసాదం వల్లనే లభ్యంగదా తల్లి !

★ ★

కల్లోలోల్లసితామృతాబ్ధిలహరీ మధ్యే విరాజన్ మణి
ద్వీపే కల్పకవాటికా పరివృతే కాదంబవాట్యుజ్జ్వలే
రత్నస్తంభ సహస్ర నిర్మిత సభామధ్యే విమానోత్తమే
చింతారత్న వినిర్మితం జనని తే సింహాసనం భావయే !

శఙ్కరాచార్య

## 22. వత్సలత

భవాని త్వం దాసే మయి వితర దృష్టిం సకరుణాం
ఇతి స్తోతుం వాంఛన్ కథయతి భవాని త్వమితియః
తదైవ త్వం తస్మై దిశసి నిజసాయుజ్యపదవీం
ముకుందబ్రహ్మేంద్ర స్ఫుట మకుట నీరాజిత పదామ్

పద్యము

నిరుపమానంద సుఖదాయినీ ! భవాని !
నీ ప్రసన్నదృష్టిని నింపు ! సుప్రసన్న !
విశ్వకారుణ్యమూర్తి వీవే సవిత్రి !
ఓ భవాని ! "నీ దాసుండనే భవాని"
అంచు భక్తుడు సగము అన్నంతలోనె
నీ కృపామృత మధుర చంద్రికల తనిపి
శ్రీపతి విధాత శక్ర కిరీటరత్న
కాంతి నీరాజిత పదాంబుజములచెంత
నుండుమని ఇత్తువమ్మ సాయుజ్య సుఖము
సర్వమంగళాస్ఫూర్తి ! వాత్సల్యమూర్తి !

వ్యాఖ్య

అమ్మా ! వాత్సల్యరూపిణీ ! దయనిరాణి ! నీదయ అపారం తల్లీ ! భక్తుడు "భవానీ ! నీవు నాపై నీ కృపామృత కటాక్షవీక్ష బరపు మమ్మా !" అని ప్రార్థింపదలచి, "భవానీ ! నీవు " అనగానే వాని వాక్యం పూర్తికాకుండానే హరి హర హిరణ్యగర్భ దేవేంద్రుల కిరీట రత్నకాంతులచే నీరాజనాలు అందుకొనే నీ పాదపద్మాలచెంత స్థానం యిచ్చి కూర్చోపెడతావు సామీప్య సాయుజ్యాలను ప్రసాదిస్తావు ఎంత దయామయివమ్మా తల్లీ ! నీ కృప నిరుపమానం అన్ని ఉపాసనలకంటే ఈ తాదాత్మ్యోపాసన శీఘ్రఫలకారి కదా !

★ ★

"ఇతి శ్రీ భవానీ స్వరూపం తదైనం ప్రపంచాత్పరం చాతి సూక్ష్మప్రసన్నం స్ఫురత్వంబ డింభశ్చ మే హృత్ సరోజో సదా వాఙ్మయం సర్వతేజోమయత్వం

## 23. గౌరీశంకరము

త్వయా హృత్వా వామం వపు రపరితృప్తేన మనసా
శరీరార్థం శంభో రపరమపి శంకే హృతమభూత్
యదేత త్త్వద్రూపం సకల మరుణాభం త్రినయనం
కుచాభ్యా మానమం కుటిల శశి చూడాల మకుటమ్

పద్యము

విశ్వకల్యాణకారిణీ! వేదమాత!
పరమశివ వామభాగమ్ము బడసి మనసి
తుష్టిచెందక విశ్వనాథునిదియైన
దక్షిణార్థమ్ముగూడ అపేక్షతోడ
క్రమముగా చేసితివి అతిక్రమము తల్లి!

దివ్యసౌందర్యలహరి! నీదేహ వామ
దక్షిణ ద్వయమ్మును మహోదయ నవారు
ణ ప్రభవలె ప్రకాశమానమ్మునగుచు
వందల కొలంది అందాలు చిందుచుండె!

మూడుకన్నులు తోచె నీ మోములోన
ఇందురేఖ నీ సీమంతమందు మెరసె
స్తనభరమ్మున నుంతవంగిన వపుస్సు
ఒప్పనింపగా ఒకరిలో ఒకరు కలిసి
ఏకతత్త్వమ్మువోలె కన్పింతురమ్మ!

వ్యాఖ్య

అమ్మా! అపర్ణా! అన్నపూర్ణా! నీవు పరమేశ్వరుని దేహంలో ఎడమభాగం ఆక్రమించావు అంతటితో తృప్తిపడక పరమేశ్వర దేహం అంతా ఆక్రమించినట్లు అనిపిస్తున్నది తల్లీ! నా మానస పీఠంపై ప్రత్యక్షమైన నీ మూర్తిలో వామదక్షిణ భాగాలలో అంతటా నీ శరీరం నుండి ప్రసరించిన ఉదయారుణకాంతుల తళతళలు ప్రకాశిస్తున్నాయి శివతత్త్వం నీతత్త్వంలో అంతర్లీనమైనట్లున్నది నీకు మూడు కన్నులున్నవి స్తనభారంచే కొంచెం ముందుకు వంగిన నీ తనూశోభ అవర్ణనీయం చంద్రమౌళి చంద్రరేఖ నీకు శిరోభూషణమై ప్రకాశిస్తున్నది నీ కిరీటు శోభ అనిర్వచనీయం శివం నీలో అంతర్భూతమై నీ స్వరూపమై సర్వత్రనిండి పరమ శివానందలహరిని అందిస్తున్నది

★ ★

గిరీంద్రాత్మజా సంగృహీతార్ధదేహం
గిరౌ సంస్థితం సర్వదాపన్నగేహమ్
పరబ్రహ్మ బ్రహ్మాదిభి ర్వంద్యమానం
శివం శంకరం శంభు మీశాన మీడే!

## 24. సదాశివుడు

జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వ న్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి
సదా పూర్వ స్సర్వం తదిద మనుగృహ్ణాతి చ శివః
తవాజ్ఞా మాలంబ్య క్షణచలితయో ర్భ్రూలతికయోః

### పద్యము

హే త్రిమూర్త్యార్చిత పదాబ్జ ! హే మదంబ !
విశ్వము సృజించును విరించి - విష్ణు లోక
రక్షణముసేయు - రుద్రుండు లయమొనర్చు-
ఈ త్రయమ్మును తనలో లయింపజేసి
ఈశ్వరుడు తన తనువున్ హరింపసేయు
తల్లి ! యుష్మ త్కటాక్షమాత్రమ్ముచే స
దా విశేషణ శబ్ద సార్థకుడు శివుడు
ఈ చతుష్టయమ్మును ఉద్ధరించుచుండు
సృష్టి నడిపించు నెప్పుడు పుష్టిగాను
ఆదిశక్తిస్వరూపిణీ ! హరునిరాణి !
సకలసర్వాధికారిణీ ! జలజపాణి !

వ్యాఖ్య

అమ్మా! సృష్టిని బ్రహ్మచేస్తున్నాడు విష్ణువు రక్షిస్తున్నాడు రుద్రుడు లయింపజేస్తున్నాడు ఈ ముగ్గురిపై ఈశ్వరుడుండి త్రిమూర్తులతోసహా సర్వం తన మహేశ్వరతత్త్వంలో లయం చేస్తున్నాడు. ఆ దశలో సదాశివుడు ఈ బ్రహ్మాండ సృష్టికి సంకల్పించి నీ కన్నులవైపు చూస్తాడు నీ కంటిసైగ ఆధారంగా బ్రహ్మ విష్ణు రుద్రేశ్వర తత్త్వ చతుష్టయాన్ని ఆ స్వామి అనుగ్రహిస్తాడు సృష్టి ప్రారంభం అవుతుంది. ఈ విధంగా అంతా నీ కనుబొమల కదలికపైనే జరుగుతున్నది తల్లీ! నమోస్తు!

★ ★

ఉదయభాను ప్రభామూర్తి సదయహృదయ
సరస దరహాస మధుర సుందర కపోల
జనని భువనేశ్వరీదేవి! జయము జయము
కనకదుర్గా భవాని! శంకరుని రాణి!

—కరుణశ్రీ

## 25. త్రిమహా మూర్తి పూజ

త్రయాణాం దేవానాం త్రిగుణ జనితానాం తవశివే
భవేత్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా
తథాహి త్వత్పాదోద్వహన మణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వ న్ముకుళిత కరోత్తంసమకుటాః

పద్యము

సర్వమంగళా! మహిళ! శ్రీచరణయుగళ!
యుష్మదంఘ్రిపూజా విశేషోపచర్య
నీ త్రిగుణముల జనియించి నెగడుచున్న
హరి హర హిరణ్యగర్భ త్రయమ్మునకును
ఆత్మపూజోపచర్యయే యగును గాదె
సర్వభువనేశ్వరీ! మహేశ్వరునిరాణి!

నీదు నవరత్న సౌవర్ణ పాదపీఠి
హరి హర విరించి మూర్తిత్రయమ్ము ప్రీతి
సాలభంజికలట్లు హస్తములు మోడ్చి
శీర్ష రత్న కిరీట రోచిస్సు దించి
చేతులను కట్టి చిత్తము చిత్తమంచు
వంగి వంగి సేవింతురు వారు - నీదు
భక్తవర్యుల సేతులందు భాగ్యమునకె
తత్త్వదర్శినీ! దివ్యసౌందర్యలహరి!

వ్యా ఖ్య

అమ్మా ! అమృతవల్లి ! త్రిగుణాలతో జనియించిన త్రిమూర్తులు నీకు జరిగే పాదపూజలే తమకు జరిగే పూజలుగా భావిస్తున్నారు గౌరవంగా తలుస్తున్నారు అంతేకాని ఆ పూజలు తమకు జరగాలని వారు తలంపరు. నీ ముందు వారెంత ! ఆ విధంగా భావించటం సహజమే కదా ! నీ పాదపీఠం చెంత నిత్యం హస్తాలు మోడ్చి రత్నకిరీట శీర్షాలు వంచి మ్రొక్కుతుంటారు వారు బ్రహ్మ విష్ణురుద్రులు అధికార పురుషులు కనుక నీ చెంత నిలిచి సేవించ గలుగుతున్నారు కానీ ఆ నీ సేవా భాగ్యం ఇతరులకు లభ్యమా తల్లీ ! అది నీ కృపా ప్రసాదం వారి పుణ్య విశేషం

★ ★

దారిద్ర్యదుఃఖభయహారిణి కాత్వదన్యా
సర్వోపకారకరణాయ సదార్ద్రచిత్తా
సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే గౌరీ నారాయణి నమోస్తుతే !

## 26. సతీత్వ మహిమ

విరించిః పంచత్వం వ్రజతి హరి రాప్నోతి విరతిం
వినాశం కీనాశో భజతి ధనదో యాతి నిధనం
వితంద్రీ మాహేంద్రీ వితతిరపి సమ్మీలితదృశా
మహాసంసారేఽస్మిన్ విహరతి సతి త్వత్పతిరసౌ

పద్యము

హే పతివ్రతామణి! పరమేశ రమణి!
విశ్వము సృజించు నలువయు - విశ్వపోష
కుండు విష్ణువు - కాలుడై యుండు యముడు
అమితధనవంతుడు కుబేర యక్షవిభుడు
ఇంద్ర సంబంధిత మనువు లెంతమందొ
ప్రళయకాలాన కాలధర్మమ్ముపొంది
కన్నుమూయుచునున్నారు - కాని తల్లి!
ఎన్ని ప్రళయాలు వచ్చి ముంచెత్తుచున్న
నీ పతి సదాశివుండు మానిత సహస్ర
దళ కమల కర్ణికోపరి స్థలములందు
విహరణమొనర్చు చిరము సాధ్వీలలామ!
నీదు మాంగల్య మహిమ వర్ణింపవశమె!

వ్యాఖ్య

అమ్మా! భగవతీ! మహాప్రళయకాలంలో బ్రహ్మదేవుడు అస్తమిస్తున్నాడు విష్ణుమూర్తి జీవితాన్ని విరమిస్తున్నాడు యముడు మృతి చెందుతున్నాడు ధనదుడు నిధనం పొందుతున్నాడు. ఇంద్రాది మనువులు తనువులు త్యజిస్తున్నారు కానీ! ఓ మహా పతివ్రతామణీ! నీ పతి సదాశివుడున్నాడే అతడు మహా సంహార కాలంలో సైతం సహస్రదళ కమలంలో విరతిలేక విహరిస్తున్నాడు విశృంఖలుడై వీరవిహారం చేస్తున్నాడు తల్లీ! ఇది అంతా నీ మాంగల్య మహిమే తల్లీ!

★ ★

అన్నపూర్ణే సదాపూర్ణే శంకరప్రాణవల్లభే
జ్ఞాన వైరాగ్య సిధ్యర్థం భిక్షాందేహిచ పార్వతీ!

## 27. సహజ పూజ

జపో జల్ప శ్శిల్పం సకలమపి ముద్రావిరచనా
గతిః ప్రాదక్షిణ్య క్రమణ మశనాద్యాహుతి విధిః
ప్రణామ స్సంవేశః సుఖమఖిల మాత్మార్పణ దృశా
సపర్యా పర్యాయ స్తవభవతు యన్మే విలసితమ్

పద్యము

సమయవిద్యా ప్రదాయినీ ! సకలజనని !
నిత్యకృత్యమ్ములన్ని సునిశ్చితముగ
నీ పదార్పణబుద్ధితో నేనొనర్చు
నట్లు బలమీయవమ్మ సాదాఖ్య ! దేవి !
స్వేచ్ఛగా సతతమ్ము గావించునట్టి
భాషణమ్మెల్ల మంత్రజపమ్ములగుత !
హస్తనేత్రాననాది విన్యాసమెల్ల
పూజనమయాన నర్పించు ముద్రలగుత !
కాలుకదరక నేసేయు గమనమెల్ల
అమ్మ ! నీ కొనర్చు ప్రదక్షిణమ్ములగుత !
అనిశ మేను భుజించెడి అశనమెల్ల
వీతిహోత్రునికొనగు హవిస్సులగుత !
శయనవేళల దేహ సంచలనమెల్ల
భక్తితో సేయు సాష్టాంగ ప్రణతులగుత !
నా నమస్కార కృత విధానమ్మునెల్ల
మాత ! జప జల్ప శిల్ప క్రమమ్ము అగుత !

శబ్ద రస రూప సుఖవస్తుచయముతోడి
జీవు డొనరించు చేష్టావిశేషమెల్ల
అమ్మ ! నీకు సంతోషప్రదమ్ము నైన
పూజయగుత ! అనుగ్రహింపుము భవాని !

## వ్యాఖ్య

అమ్మా ! భగవతీ ! నా పూజ ఇలా స్వీకరించు తల్లీ !

మనోవాక్కాయాదులచేత చేయు నా సమస్త క్రియలు బ్రహ్మార్పణంగా స్వీకరించు నే చేయు సరస సల్లాపాలు అన్నీ నిన్ను జపించు మంత్రాలుగా భావించు నా అవయవ హస్త విన్యాసాదులు అన్నీ నీ పూజలో చూపింపబడు ముద్రలుగా తలంచు నా స్వేచ్ఛాగమనమంతా నీ గుడిప్రదక్షిణ అగుగాక ! నా భోజనం నీకు హోమాహుతులు అగుగాక ! శయ్యపై నేను దొరలుటలు నీకు దండ ప్రణామములు అగుగాక ! నా చేష్టా విలాసాలు అన్నీ నీ పూజా క్రియాకలాపాలు అగుగాక !

సర్వం బ్రహ్మార్పణం చేయటమే ఆత్మపూజా స్వరూపం. ముఖ్యంగా సమయాచారులకు సాదాఖ్య తత్వజ్ఞులకు సహస్రార సూర్యమండలమందే త్రిపురసుందరీ పూజ ఆత్మజ్ఞానమందే రతి చతుర్విధైక్యం, షడ్విధైక్యం అనుసంధానమే వారికి భగవదారాధన కదా తల్లీ ! నా పూజ అందుకోవమ్మా !

## 28. తాటంక మహిమ

సుధా మప్యాస్వాద్య ప్రతిభయ జరామృత్యు హారిణీం
విపద్యంతే విశ్వే విధి శత మఖాద్యా దివిషదః
కరాళం యత్క్ష్వేళం కబళితవతః కాలకలనా
న శంభో స్తన్మూలం తవ జనని తాటంకమహిమా

### పద్యము

హే పతివ్రతామణి ! పరమేశురమణి !
విధి సురేంద్రాది దైవత వీరవరులు
వ్యాధి వృద్ధాప్య మరణ భయమ్ముబాపు
క్షీరసాగరోద్భూత సుధారసమ్ము
త్రాగియు తనువుచాలించసాగినారు
సర్వమంగళ ! జగదధిష్ఠానదేవి !

కాలకాకోల ధారా కరాళ గరళ
మెల్ల గళగళన్ గ్రోలి నీ వల్లభుండు
ఇంత కనుగందకున్నాడు ఎందుచేత ?
మాత ! భవదీయ తాటంక మహిమచేత !

## వ్యాఖ్య

అమ్మా! భవానీ! అమృతం త్రాగి బ్రహ్మేంద్రాదులు జరామృత్యువులు తమకు రావుకదా అనుకొన్నారు కానీ కాలం మారేసరికి అందరూ హతమైపోసాగారు మరీ విచిత్రం ఏమిటంటే! మహాకాలకూట విషాన్ని సేవించి కూడ నీ పతిదేవుడు సదాశివుడు మాత్రం అట్లే ఉన్నాడు మృత్యుంజయుడై విహరిస్తున్నాడు. ఇది అంతా నీ తాటంక మహిమయే కదా తల్లి! నీ తాటంకాలను ఎదుర్కొనే శక్తి ఏ కాలానికీ లేదు తల్లి! నీ పాతివ్రత్య మహిమ సర్వాతిశాయి

 

మ్రింగెడువాడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో!

—బమ్మెరపోతన

# 29. పేరోలగము

కిరీటం వైరించం పరిహర పురః కైటభ భిదః
కఠోరే కోటీరే స్థలసి జహి జంభారి మకుటమ్
ప్రణమ్రేష్వేతేషు ప్రసభ ముపయాతస్య భవనం
భవస్యాభ్యుత్థానే తవ పరిజనోక్తి ర్విజయతే

పద్యము

నీ పతి సుధాంశుమౌళి నీ నిలయమునకు
వచ్చుచున్నట్లు తెలియగా త్వరితగలిని
సంభ్రమమ్మున నెదురేగు సమయమందు
బ్రహ్మ విష్ణు మహేంద్ర దైవతగణమ్ము
అహమహమిక ప్రణామమ్ము లాచరింప
"జలజదళనేత్రి! నీముందు జలజభవుని
రత్నకోటీరమమ్మ డూరమ్ము జరుగు-
కామినీమణి! అటుపైని కైటభారి
స్వర్ణమకుటమ్ము అటు పాదజలజ మిడకు-
అభవు నందాలరాణి! జంభాసురారి
మణికిరీటమ్ము - ప్రక్కదుమలగు' మంచు
పరిజనమ్ములు నీకు హెచ్చరికలీయ
ఇంత వైభవమ్మున నొప్పు ఈశ్వరహృద
యేశ్వరీ! శ్రీకరీ! శంకరీ! జయోస్తు!

వ్యాఖ్య

"అమ్మా! పార్వతీ! నీ పతిదేవుడు నీ గృహానికి వస్తున్నాడని ఆనందంతో ఎదురువెళుతున్నావు సరేకానీ! నీకెందుకమ్మా అంత తొందర జాగ్రత్తగా మెల్లమెల్లగా క్రింద చూచి నడు తల్లీ! నీ పాదాలముందు బ్రహ్మదేవుడి కిరీటం మోకరిల్లి ఉంది తల్లీ! కొంచెం దూరంగా అడుగు వెయ్యి ఆ ప్రక్క విష్ణుదేవుడి నవరత్న కిరీటంపై అడుగువేస్తావేమో జాగ్రత్త ఇక్కడ మహేంద్ర కిరీటం కొంచం తొలగి నడు" అని నీ పరిచారికలు హెచ్చరికలు చేస్తుంటారు అట్టి నీ వైభవోత్కర్ష అనిర్వచనీయం కదా!

★ ★

స్వర్ణదీ స్వర్ణ రంజ కింజల్కములకు
పసిమిదిద్దెడు గిరికన్య పాణితలము
పట్టుకొని పీడగాలేడు భవుడు - మేను
పులకరింప క్రొవ్వలపులు తొలకరింప

—కరుణశ్రీ

## 30. కర్పూర నీరాజనము

స్వదేహోద్భూతాభిః ఘృణిభిః అణిమాద్యాభిరభితః
నిషేవ్యే నిత్యే త్వామహమితి సదా భావయతి యః
కిమాశ్చర్యం తస్య త్రినయన సమృద్ధిం తృణయతః
మహాసంవర్తాగ్ని ర్విరచయతి నీరాజనవిధిమ్

### పద్యము

అంబ! భవదీయ దివ్య పాదారవింద
నఖ మయూఖోజ్జ్వల నవ సౌందర్యలహరి!
ఉద్భుత వర ప్రద! అణిమాద్యష్టసిద్ధి
మాతృకార్చిత మహిత సమ్మాననీయ!
నిను త్వమేవాహమంచు వినిశ్చితాత్మ
నిత్య నిష్ఠాగరిష్ఠ ధ్యానించువాడు
త్రినయన త్రిలోకాదర ప్రియ మహత్వ
నిర్మలైశ్వర్యమైన తృణీకరించు
అట్టి నీ భక్తవరునకు - అఖిలజనని!
ప్రళయకాల మహాగ్ని ప్రభాచయమ్ము
నవ్య కర్పూర నీరాజనమ్ము అగును
అనిన ఆవంతలేదమ్మ అతిశయోక్తి!
దివ్య నిత్య ప్రమాణ! సంసేవ్యమాన!
జ్ఞానవిజ్ఞాన వర సారసప్రదాన
వందనీయా! సదాశివానందనిలయ!
జయ సహస్రార చక్రతేజః ప్రసార!

వ్యాఖ్య

మాతా! ఆద్యంతరహితా! మంత్రపూతా!

భక్తుడు నిన్ను సేవిస్తున్నాడు నీ పాదపద్మాలనుండి ప్రసారమయ్యే మణిమయూఖాలు అణిమ మహిమ లఘిమ గరిమ ప్రాప్తి ప్రాకామ్యం ఈశత్వం వశిత్వం అనే అష్టసిద్ధులను అనుగ్రహిస్తాయి అయినా ఆ భక్తుడు నిశ్చలుడై "శివోఽహమ్" అని ధ్యానిస్తుంటాడు ఆ భక్తుడికి సూర్యచంద్రాగ్ని తేజస్సు, ఇడాపింగళా సుషుమ్నాయోగశక్తి కరతలామలకమే అతనికి త్రినయనుడైన సదాశివుని మహైశ్వర్యం కూడా తృణీకారమే ఆ భక్తునికి మహాప్రళయ కాలానల జ్వాలాతోరణం కర్పూర నీరాజన విధి నిర్వహిస్తుంది. ఇందులో ఆశ్చర్యమేమున్నది తల్లీ! నీ కృపా మహిమ అమోఘం గదా!

★ ★

యద్భక్తాఖిల కామపూరణచణ స్వాత్మప్రభావం మహో
జాడ్యధ్వాంత నివారణైక తరణి ర్జ్యోతిః ప్రబోధప్రదం
యద్వేదేషుచ గీయతే శ్రుతిముఖం మాత్రాత్రయేణోమితి
శ్రీవిద్యే తవ సర్వరాజ వశకృత్ తత్కామరాజం భజే!

—దేవీమహిమ్న

# 31. శ్రీ విద్య

చతుష్షష్ట్యా తంత్రైః సకల మతిసంధాయ భువనం
స్థిత స్తత్త త్సిద్ధి ప్రసవపరతంత్రైః పశుపతిః
పున స్త్వన్నిర్బంధా దఖిల పురుషార్థైకఘటనా
స్వతంత్రం తే తంత్రం క్షితితల మవాతీతరదిదమ్

పద్యము

అమ్మ! భగవతీ! నీ పతి ఆ పశుపతి
అరువదియునాల్గు తంత్ర విద్యా రహస్య
వివిధ సిద్ధాంత మార్గాలు వెలువరించి
ఉన్నత సమాధిమగ్నుడై ఊరకుండె
ఐంద్రజాలాది మోహ మాయలకు లొంగి
భువన బుధకోటి మాయాబ్ధి మునిగిపోయె
ధర్మ పతితమై మానవత్వమ్ము మరచి
భ్రష్టమై సమాజమ్ము నికృష్టమయ్యె
అమ్మ! నీవు కాబట్టి ఆ అవసరమున
పరమశంకరమూర్తి నిర్బంధపెట్టి
పరమపురుషార్థ కైవల్య ఫలదమైన
అచ్చ తంత్రవిశేషమ్ము లరసి అడిగి
శిష్ట వైదికాచార ప్రసిద్ధ మతము
పరమ ముక్తిప్రదమ్ము సర్వస్వతంత్ర
విశ్వకల్యాణకరము శ్రీవిద్య అంచు
శివునిచేతనే బోధింపజేసినావు!

వ్యా ఖ్య

అమ్మా ! భగవతీ ! ఆ పశుపతి ఐహికాదులగు పరకాయ ప్రవేశం ఆకాశగమనం జల అగ్ని వాయు స్తంభనాదులైన ఇంద్రజాల మహేంద్రజాల విద్యలు, వాని విద్యాస్వరూప సిద్ధాంతాలు, అభీష్ట దాయకాలైన మహామాయా శాంబరాదులు అరువదినాలుగు జ్ఞానార్ణ వాదులైన తంత్రగ్రంథాదులచేత ప్రవేశపెట్టినాడు అయితే ఆ ప్రభా వాలకు తట్టుకోలేక ఎక్కువమంది పండితులు మోహజాలంలో బలి కాసాగారు అందువల్ల ఇవి భక్తులకు అర్హములు కావని ఎరిగి నీవు నీ భర్తను ఉత్తమవిద్య బోధింపుమని నిర్బంధిస్తే అపుడు పశుపతి ఎల్ల పురుషార్థాలు చేకూర్చే శ్రీవిద్యాతంత్రాన్ని నీ ద్వారా లోకానికి అందించాడుకదా తల్లీ ! భక్తుల మానసిక స్థితిగతులెరిగి లోకానికి ఇంత మహోపకారం చేసిన తల్లివి నీవేనమ్మా !

★ ★

శ్రీవిద్యాం శివవామభాగనిలయాం హ్రీంకార మంత్రోజ్జ్వలాం
శ్రీచక్రాంకిత బిందుమధ్య వసతిం శ్రీమత్సభా నాయికాం
శ్రీమత్షణ్ముఖ విఘ్నరాజ జననీం శ్రీమజ్జగన్మోహినీం
మీనాక్షీం ప్రణతోస్మి సంతత మహం కారుణ్య వారాన్నిధిమ్

—శంకరాచార్య

## 32. పంచదశీమంత్రము

శివ శ్శక్తిః కామః క్షితి రథ రవి శ్శీతకిరణః
స్మరో హంస శ్శక్రః తదనుచ పరా మార హరయః
అమీ హృల్లేఖాభి స్తిసృభి రవసానేషు ఘటితాః
భజంతే వర్ణాస్తే తవ జనని నామావయవతామ్

పద్యము

షోడశాక్షరీమంత్ర సంశోభితాంగి
శివుడు శక్తియు కాముండు క్షితియు మరియు
రవి శశి స్మర హంస వాసవులు చివర
పరయు మారుడు హరియు దేవతల బీజ
వర్ణములు పదిరెండు - కొనల హ్రీం వర్ణములును
మూడు - ఘటియింప జగదేకమూలమైన
త్రిపురసుందరీ నామాంక దివ్యమైన
పంచదశి మహామంత్రమై వరలెనమ్మ !
నీ మహామంత్ర ఫలము వర్ణింపవశమె
మంత్ర యంత్ర తంత్రాత్మికా ! మహిత సంయ
మీప్సితార్థప్రదా ! జననీ ! భవాని !

## వ్యాఖ్య

అమ్మా! జగన్మాతా! రాజరాజేశ్వరీదేవీ! నీ మంత్ర బీజాక్షరాలు క ఏ ఈ ల హ్రీం, హ స క హ ల హ్రీం, స క ల హ్రీం అనునవి సామాన్యమైనవి కావు కదా! మునుముందు శివుడి దైన కకారం, శక్తిదైన ఏకారం, కాముని దైన ఈకారం, క్షితిదైన లకారం, చివర హ్రీంకారం మొదటిగుచ్ఛం రవిదైన హకారం, చంద్రుని సకారం, స్మరుని కకారం, హంసుని హకారం, శక్రునిదైన లకారం, చివర హ్రీకారం రెండవగుచ్ఛం పరాదేవిదైన సకారం, మారుడిదైన కకారం, హరిదైన లకారం చివర హ్రీంకారం మూడవ గుచ్ఛం ఈ మూడు కలిసి పంచదశ వర్ణాత్మికమై నీపేర త్రిపుర సుందరీ మహామంత్రం అయింది తల్లీ! చతుష్షష్టి తంత్రవిద్యలలో ఇది పరమ పురుషార్థ మంత్రం. ఇది శివుడు ఉపదేశించిన మంత్రరాజం

 

శ్రీచక్రం శ్రుతిమూలకోశ ఇతి తే సంసార చక్రాత్మకం
విఖ్యాతం తదధిష్ఠితాక్షర శివ జ్యోతిర్మయం సర్వతః
ఏతన్మంత్రమయాత్మికాభిరరుణం శ్రీసుందరీభిర్వృతం
మధ్యే బైందవ సింహపీఠ లలితే త్వం బ్రహ్మవిద్యా శివే

—దుర్వాసమహర్షి

# 33. మంత్రోపాసన

స్మరం యోనిం లక్ష్మీం త్రితయమిద మాదౌ తవ మనోః
నిధా యైకే నిత్యే నిరవధి మహాభోగరసికాః
భజంతిత్వాం చింతామణి గుణ నిబద్ధాక్షవలయాః
శివాగ్నౌ జుహ్వంతః సురభి ఘృతధారాహుతి శతైః

పద్యము

అమ్మ! ఆద్యంతరహిత! నిత్యస్వరూప
నీ మహామంత్రమున ముందు కామరాజ
బీజమును భువనేశ్వరీ బీజ మాది
లక్ష్మి బీజమ్ము త్రయము మేళనముచేసి
నిన్ను హృదయారవిందాన నిలుపుకొనియు
భవ్య చింతామణిగణ నిబద్ధ పద్మ
బీజమాలికలు ధరించి ప్రీతితోడ
తల్లిరో! త్రికోణరూప బైందవములోని
అతి పవిత్ర విశిష్ట శివాగ్ని యందు
కామగవి ఘృతాహుతులసంఖ్యములు నిష్ఠ
హోమమునుజేసి ఆత్మవిద్యా మహా సు
ఖానుభవ మహాయోగులు అనవరతము
నిన్ను సంపూర్తిగాను ధ్యానింపగలరు!

వ్యా ఖ్య

మాతా ! ఆద్యంతరహితా ! నిత్యపునీతా ! నిరవధిక నిత్య సుఖ మహారసజ్ఞులైన పరమ యోగీంద్రులు ఏ కొందరో నీ తత్వమెరిగి నిన్ను ఉపాసింపగలరు తల్లీ! నీ మంత్రానికి ముందు కామరాజబీజం క్లీం, భువనేశ్వరీ బీజం హ్రీం, లక్ష్మీబీజం శ్రీం మూడింటిని సంపుటి చేసికొని, చింతామణి నిర్మిత అక్షమాలను ధరించి, బైందవ స్థాన మందు శివాగ్నిని స్వాధిష్ఠానంలో ప్రతిష్ఠించుకొని, ఆజ్యధారలచే సహస్రాధిక అహుతులు సమర్పిస్తూ హృదయకమలంలో నిన్ను నిల్పి పరమమునీంద్రులు ఆరాధిస్తుంటారు తల్లీ! ఇది అంతా మానసార్చన - సమయాచార విధానం

 

సకుంకుమ విలేపనాం అళికచుంబి కస్తూరికాం
సమందహసితేక్షణాం సశరచాప పాశాంకుశాం
అశేషజనమోహినీం అరుణమాల్య భూషాంబరాం
జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరే దంబికామ్ !

## 34. భైరవీ భైరవులు

శరీరం త్వం శంభో శ్శశిమిహిర వక్షోరుహాయుగం
తవాత్మానం మన్యే భగవతి నవాత్మానమనఘమ్
అతశ్శేష శ్శేషీ త్వయ ముభయసాధారణతయా
స్థితస్సంబంధో వాం సమరస పరానంద పరయోః

పద్యము

భగవతీ! నీవు ఆనందభైరవునకు
రవి శశి స్తనయుగ శరీరమ్మవగుదు -
ఆ నవవ్యూహపరు డనఘాత్మకుండు
నీకు దేహమై విశ్వమ్ము నిండియుండు
శేషమతడైన ఓ తల్లి! శేషి వీవు
శేషి అతడైన అప్పుడు శేష మీవు
పర పరానంద సమరసపాత్రులైన
భైరవీ భైరవులు మీరు - మీరిరువురు
సామరస్య ప్రతీకలు జగతియందు
ప్రీతితో సతము నమస్కరింతుమమ్మ!

వ్యా ఖ్య

అమ్మా! భగవతీ! భారతీ! సూర్యచంద్రులు నీకు తాటంకాలుగా కొంతసేపు ప్రకాశిస్తుంటారు ఆ సూర్యచంద్రులే నీ పాలిండ్లుగా అమృతకుంభాలై జీవకోటికి ఆనందాన్నిస్తాయి మరొక సారి ఆ సూర్యచంద్రులే నీ నేత్రాలుగా విరాజిల్లుతుంటాయి తల్లీ! కాలరూప చిహ్నాలైన సూర్యచంద్రులు నీ శరీరంలో భాగాలుగా అలంకృతా లవుతుంటాయి. నవవ్యూహాత్మకుడు ఆనందభైరవుడు అయిన శివుడు నీ శరీరం నీవు శేషం, ఆ పరమశివుడు శేషి. మరొకప్పుడు ఆ శివుడు శేషం, నీవు శేషివి మీరిరువురు దోష రహితులు మంగళమూర్తులు పరాపరానందులు ఆనందభైరవీ భైరవులైన మీరు సర్వ విధాల సములై నా హృదయంలో భాసిస్తు న్నారు తల్లీ!

★ ★

నమశ్శివాభ్యాం జగదీశ్వరీభ్యాం జగత్పతిభ్యాం జయవిగ్రహాభ్యామ్
జంభారిముఖ్యైరభివందితాభ్యాం నమోనమ శ్శంకరపార్వతీభ్యామ్
—ఉమామహేశ్వర స్తవము

## 35. వి శ్వ మూ ర్తి

మన స్త్వం వ్యోమ త్వం మరుదసి మరుత్సారథి రసి
త్వ మాప స్త్వం భూమి స్త్వయి పరిణతాయాం నహిపర
త్వమేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వవపుషా
చిదానందాకారం శివయువతిభావేన బిభృషే

ప ద్య ము

హే శివయువతీ ! సుమతి ! నీవే మనంబు -
నీవె వ్యోమంబు - వాయువు నీవె - వాయు
సారథి మహాగ్ని వీవేను - జలము నీవె
భూమితత్త్వసంపద వీవె మూలశక్తి !
పంచభూతాత్మకము నీవె - పరిణమింతు
వన్ని రూపాల తాదాత్మ్య మందుకొనుచు
ఈవు కాకుండ అన్యమ్ము ఇంతలేదు
సర్వ మీవే ! అఖండ విశ్వస్వరూప !
తల్లి ! నీవు సంకల్పమాత్రమ్ము చేత
ఘనశివానంద భైరవ కమలజాండ
రూపము ధరింతువమ్మ చిద్రూపనగరి !
ఆర్య ! దివ్య మాధుర్య సౌందర్యలహరి !

వ్యాఖ్య

అమ్మా ! శివానీ ! భవానీ ! శర్వాణీ !

ఆజ్ఞాచక్రంలో ఉండే మనస్తత్వం నీవే ! విశుద్ధి చక్రంలోని ఆకాశతత్త్వం నీవే ! అనాహత చక్రం అనే సంవిచ్చక్రంలోని వాయుతత్త్వం నీవే ! స్వాధిష్ఠానంలోని అగ్నితత్త్వం నీవే ! మణిపూరంలో వసించే ఉదకతత్త్వం నీవే ! మూలాధారంలో నిలిచియున్న పృథ్వీతత్త్వం నీవే !

ఇలా పంచభూత పంచతన్మాత్రలలో పరిణమించి పరిమళించి నీవు సర్వత్రా నిండి ఉంటే నిన్ను మించి అన్యం ఈ విశ్వంలో ఏమి ఉన్నదమ్మా ! నీవే నీ స్వరూపాన్ని జగదాకారంగా పరిణమింప చేయతలచి చిచ్ఛక్తితో కూడిన ఆనందభైరవ స్వరూపాన్ని శివ తత్త్వాన్ని నీ చిత్తంలో భావిస్తుంటావు నిన్ను ఇలా తెలిసికొన్న వాడికి ముక్తి కరతలామలకం గదా !

★ ★

చారు నవరత్న ఖచిత కాంచన కిరీట
పరమ కారుణ్య రసపూర్ణ పద్మనయన
భక్తి ముక్తులనిడు పరాశక్తి ! జయము
కనకదుర్గా భవాని ! శంకరుని రాణి !

—కరుణశ్రీ

## 36. ఆజ్ఞ

తవాజ్ఞాచక్రస్థం తపన శశికోటిద్యుతిధరం
పరం శంభుం వందే పరిమిళితపార్శ్వం పరచితా
యమారాధ్య న్భక్త్యా రవిశశిశుచీనా మవిషయే
నిరాలోకేఽలోకే నివసతిహి భాలోకభువనే

వద్యము

అమ్మ ! భగవతీ ! భవదాజ్ఞయందు సతము
నీదు శ్రీచక్ర శివచక్ర నిచయమున వ
సించి రవిచంద్రకోటి రోచిస్సు చిమ్మి
పరచితాశక్తి మేళన పార్శ్వ యుగళు
డైన పరుడు పరంజ్యోతి సాంబమూర్తి
పాదపద్మమ్ములకు శతవందనములు-
ఇట్టి శివమూర్తి నెవడు భజించుచుండు
కూర్మితో ప్రసన్నముచేసికొనుచుయందు
రక్తిగలవాడొ ! వాడు సూర్య శశి వహ్ను
లింత వెలిగింపలేనట్టి - ఎవనికేని
అంతుపట్టని మానసేకాంతసీమ
సాంద్ర చంద్రికాపూర్ణ ప్రశాంత సరసి
కాంతు లెగజిమ్మెడి సహస్రకమలపీఠి
తేజరిలుచుండుగద మహాదేవదేవి !

వ్యా ఖ్య

అమ్మా ! నీ భ్రూమధ్యంలోగల ఆజ్ఞాచక్రంలో శంభుడు ప్రకాశిస్తున్నాడు ఆ దేవదేవుడు శతకోట్ల సూర్యచంద్రుల కాంతితో తేజరిల్లుతున్నాడమ్మా ! ఆయనకు పర అనే చిచ్ఛక్తి రెండువైపులా సేవింపగా పరంధాముడైన పరమశివుడు విరాజిల్లుతున్నాడు ఆ స్వామికి సాష్టాంగ ప్రణతి చేస్తున్నాను తల్లీ ! ఆ శివమూర్తిని భజించటంచేత భక్తుడికి సూర్యచంద్రాగ్నులు చొరలేని ఏకాంత జ్యోత్స్నామయ లోకంలో సహస్రార సుధాసింధువులో నీ సాయుజ్యం పొంద వీలు కలుగుతుంది కదమ్మా !

★ ★

స్మేరాననం చంద్రకళావతంసం
గంగాధరం శైలసుతాసహాయం
త్రిలోచనం భస్మభుజంగభూషణం
ధ్యాయేత్ పశూనాంపతిమీశితారమ్ !

## 37. విశుద్ధి

విశుద్ధౌ తే శుద్ధ స్ఫటిక విశదం వ్యోమజనకం
శివం సేవే దేవీమపి శివసమాన వ్యవసితామ్
యయోః కాంత్యా యాంత్యా శ్శశికిరణసారూప్యసరణే
ర్విధూతాంతర్ధ్వాంతా విలసతి చకోరీవ జగతీ

### పద్యము

చంద్రమౌళిప్రియ! విశుద్ధిచక్రమందు
స్వచ్ఛ నిర్మల స్ఫటికమ్ము వలె వెలుంగు
వ్యోమజనకుడౌ శివునితో నుద్దియగుచు
అఖిల శుభకర వ్యవసాయమందు చెలగు
శంకరునిదేవి! నిను ఉపాసనము సేతు-
చంద్ర చంద్రికా సారూప్యసరణి వెలుగు
శివశివాంగ ప్రభూత రోచిస్సు త్రావి
కలుషహారమై వెలింగె జగత్త్రయమ్ము-
పండువెన్నెలలను పొట్టనిండ గ్రోలి
గ్రోలి సంతుష్టయైన చకోరివోలె-

వ్యాఖ్య

అమ్మా! నీ విశుద్ధచక్రంలో శుద్ధ స్ఫటికంవలె ప్రకాశించే వాడూ ఆకాశతత్త్వం కలుగజేసేవాడూ అయిన పరమశివుణ్ణి- ఆ పరమశివుడితోపాటూ శివస్వభావవై భగవతివైన నిన్నూ ఉపాసిస్తున్నాను తల్లీ! అమ్మా! శివాశివుల నుండి ప్రసారమయ్యే చంద్ర చంద్రికా ప్రభాజాలాల వలన ముజ్జగాలు తమలోని అజ్ఞానాంధకారాలు పోగొట్టుకొని జ్యోత్స్నాపానం చేసి సంతుష్టాంత రంగులైన చకోర రాజాలవలె విలసిల్లుతున్నాయి తల్లీ!

★ ★

నమశ్శివాభ్యాం పశుపాలకాభ్యాం
జగత్త్రయీరక్షణ బద్ధహృదాభ్యాం
సమస్తదేవాసుర పూజితాభ్యాం
నమోనమ శ్శంకరపార్వతీభ్యామ్

—ఉమామహేశ్వర స్తవం

# 38. అనాహతము

సమున్మీల త్సంవిత్ కమలమకరందైకరసికం
భజే హంసద్వంద్వం కిమపి మహతాం మానసచరమ్
యదాలాపా దష్టాదశగుణితవిద్యాపరిణతిః
యదాదత్తే దోషా ద్గుణ మఖిల మద్భ్యః పయఇవ

పద్యము

మధుర సంవిత్కమల సుధామధువు గ్రోలి
మానససరస్సులోపల తానమాడు
భావనాతీత సంతతాపార సార
హంసయుగమైన శివశక్తి కంజలింతు
పాలునీరును విడదీసి పాలుగొనెడి
పరమహంస ఋతమ్ములై పదునెనిమిది
విద్యలై ప్రవర్తిల్లె ఈ విశ్వమందు.
అ మరాళ మిథునమును అభినుతింతు
అత్మరేఖినితో శిఖి అనాహతమునందు
దివ్య దీపాంకురము భాతి తేజరిల్లు
ఆ ఉమామహేశ్వర సమయాన్వయమ్ము
వెలుగులీనుచు నా హృది నిలుచుగాత!

వ్యాఖ్య

అమ్మా! మీ మిథునవైభవం వర్ణించలేము తల్లి! అనాహత చక్రంలోని కమలం జ్ఞాన సంవిత్కమలం ఆ అరవింద మకరంద పానంలో అత్యంతాసక్తులు మీరు మహాయోగి మానససరోవర విహార తత్పరులైన రాజహంసలు మీరు ఏమి చెప్పమంటారు? షట్త్రింశత త్త్వ విరాజితమైన శివశక్తి సంపుటి మీది అట్టి మీ పరమహంస మిథునాన్ని భజిస్తున్నాను తల్లీ!

తల్లీ! మీ కలహంస గీతాలనుండియేకదా వేదాలూ, వేదాంగాలూ, అష్టాదశ పురాణాలూ షట్ శాస్త్రాలూ వెలువడ్డాయి జలక్షీరాల నుండి క్షీరం గ్రహించి జలం విడిచినట్లుగా మా దోషాలు విడిచి గుణాలు గ్రహించే ఆదర్శ రాజహంస దంపతులమ్మా మీరు! మీ దంపతులకు అనేక నమస్కృతులు

★ ★

నమో భూతనాథం నమో దేవదేవం
నమః కాలకాలం నమో దివ్యతేజం
నమః కామభస్మం నమో శాంతశీలం
భజే పార్వతీవల్లభం నీలకంఠమ్

—పార్వతీవల్లభాష్టకం

# 39. స్వాధిష్ఠానము

తవ స్వాధిష్ఠానే హుతవహ మధిష్ఠాయ నిరతం
తమీడే సంవర్తం జనని మహతీం తాంచ సమయామ్
యదాలోకే లోకాన్ దహతి మహతి క్రోధకలితే
దయార్ద్రా యా దృష్టి శ్శిశిర ముపచారం రచయతి

పద్యము

జనని ! నీదు స్వాధిష్ఠాన చక్రమందు
అగ్నితత్త్వ మధిష్ఠించి అనవరతము
ప్రబల సంవర్తరూపుడై ప్రభలుజిమ్ము
ఆ మహాదేవు పాదమ్ము లభినుతింతు -
సమయనామ్నివై శివునంత శక్తికలిగి
మహిత సంవర్త రూపాగ్నిసహితవగుచు
దివ్యతేజస్సుతో వెల్గు దేవి ! నిన్ను
ప్రస్తుతించెద నిశ్చల భక్తితోడ
భయద సంవర్త వహ్ని రూపమున పొలుచు
హరుని వీక్షణ జగతి దాహకముకాగ
ఏడులోకాలు నీ కృపాదృష్టిచేత
శీతలోపచారములంది క్షేమమందు
కడుపుచల్లని తల్లి ! భూకల్పవల్లి !

వ్యాఖ్య

అమ్మా! నీ స్వాధిష్ఠానంలో అగ్నితత్త్వం వహించిన సంవర్తాగ్నిరూపుడగు పరమశివుణ్ణి - మహాసమయ నామంతో సంవర్తాగ్నిరూపంలో గల నిన్నూ సేవిస్తున్నాను ఫాలాక్షుని రూక్షవీక్షణాలు లోకాలను దహింపచేస్తుంటే నీ కటాక్షవీక్షణాలు లోకాలకు శీతాలోపచారాలు కలిగించి పునస్సృష్టికి ప్రాపు కలిగిస్తున్నాయి మాకు మీరిరువురూ కావాలి తల్లీ! నీ దయార్ద్ర దృష్టిలో లోకాలు బ్రతుకుతున్నాయి కదమ్మా!

★ ★

శరచ్చంద్రప్రకాశేన వపుషా శీతలద్యుతిం
ధ్యాయేత్సింహాసనాసీన ముమయా సహితం శివమ్ ।

## 40. మణిపూరము

తటిత్వంతం శక్త్యా తిమిర పరిపంథిస్ఫురణయా
స్ఫురన్నానారత్నాభరణ పరిణద్ధేంద్రధనుషమ్
తవ శ్యామం మేఘం కమపి మణిపూరైకశరణం
నిషేవే వర్షంతం హరమిహిరతప్తం త్రిభువనమ్

పద్యము

అమ్మ ! నీ మణిపూరచక్రమ్మె శరణ
మైన శంభుండు మేఘుడై అలరసాగె
నిశ్చల నిశాత సౌదామినీ విధాన
మెరసి శివశక్తి దివి మిరుమిట్లుగొలిపె
వివిధ రత్నాభరణకాంతి విలసనములు
ఇంద్రచాపమో నాగ దీపింపసాగె
నిశిత సంవర్త కిరణుడై నిఖిల జగతి
దగ్ధమొనరించిన త్రినేత్ర తరణి మరల
అఖిల విశ్వకల్యాణ వర్షాంబుద స్వ
రూపము వహించి అమృతధారాపరీత
కారణుండై ప్రవర్తిల్లె కన్నతల్లి !
పరమ కరుణాంతరంగుడై వరలుచున్న
ఆదిశంకరస్వామి పాదాంబుజములు
సర్వవిధముల నతిభక్తి సంస్తుతింతు !

### వ్యాఖ్య

అమ్మా! మణిపూరకం తామిస్రనిలయం ఆ తమస్సు పోగొట్టటానికి నీ వివిధాభరణమణులు విద్యుత్కాంతులను ప్రసరింప చేస్తున్నాయి ఆ మణికాంతులు ఇంద్రధనుశ్శోభలను సృష్టిస్తున్నాయి ఆ కాంతివలయం శాంతినిలయం అది మనోహరం వర్షాంబుద రూపుడై జటాజూటుడు ఈ మణిపూరంలోనే నివసిస్తున్నాడు వర్ష మేఘాన్ని అంటిపెట్టిన తటిల్లతవలె నీమై శక్తి ప్రకాశిస్తున్నది ఈ శివశక్తి స్వరూపం దర్శనీయంగదా! సంవర్తాగ్నిలో దహనమైన లోకాలకు వర్షం కురిపించే విద్యుల్లతా విలసిత శ్యామసుందర జలధర రూపుడైన సదాశివుణ్ణి సర్వవిధాల అర్చిస్తున్నాను తల్లీ!

 

"నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే, అథో యే అస్య సత్వానోఽహం తేభ్యోఽకరం నమః "

—నమకము

## 41. మూలాధారము

తవాధారే మూలే సహ సమయయా లాస్యపరయా
నవాత్మానం మన్యే నవరసమహాతాండవనటమ్
ఉభాభ్యామేతాభ్యా ముదయవిధి ముద్దిశ్య దయయా
సనాథాభ్యాం జజ్ఞే జనకజననీ మ జ్జగదిదమ్

పద్యము

జనని ! నీదు మూలాధార చక్రసీమ
లాస్య మొనరింపఁగోరు నీ లాలితాంశ
కామినీమణి 'సమయ''తో కలిసిమెలిసి
నవరసపరీత భవ్య తాండవముసేయు
నటుని శివుని నవాత్మ నానందభైర
వునిగ తలపోయుచున్నాను - జనని ! నేడు
పరమకారుణ్యపరులు మీరిరువురొక్క-
దీక్షతో విశ్వకల్యాణ వీక్షచేసి
నాఁడు సంవర్తవహ్నిలో మాడిపోయి
నాశనమ్మైన జగతిని నవ్యసరణి
మరల నుత్పత్తిచేయగా కరుణబూని
జగతికెల్లను జననియు జనకులగుచు
ఆదిదంపతులైనారుగాదె మీరు !

వ్యాఖ్య

అమ్మా ! నీ మూలాధారచక్రంలో లాస్యవిలాసాలు చూపే సమయ అనే ఆనందభైరవితో నవరసాలొలికించు తాండవమూర్తి శివుణ్ణి నవాత్మునిగా ఆనందభైరవునిగా భావిస్తున్నాను సంవర్తాగ్నిలో దగ్ధమైన లోకాలను బ్రతికించేందుకు దయతో వచ్చిన మీ ఆనంద భైరవ మహాభైరవ రూపాలు చూచి జగములు తల్లిదండ్రులు కలవైన వని పొంగిపోతున్నాను తల్లీ !

★ ★

నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యాం
నగేంద్రకన్యా వృషకేతనాభ్యాం
నమోనమ శ్శంకరపార్వతీభ్యాం !

## 42. కనక కిరీటవు

గతైర్మాణిక్యత్వం గగనమణిభి స్సాంద్రఘటితం
కిరీటం తే హైమం హిమగిరిసుతే కీర్తయతి యః
స నీడేయచ్ఛాయాచ్ఛురణశబలం చంద్రశకలం
ధను శ్శౌనాసీరం కిమతి న నిబధ్నాతి ధిషణామ్

పద్యము

ఓ హిమగిరీశ్వరకుమారి ! యుష్మదీయ
ద్వాదశాదిత్య మణిగణస్థగిత వజ్ర
కనకమకుటమ్ము వర్ణించు కవివరుండు
గోశరత్నరంజిత శతకోటిరుచులు
ప్రతిఫలించి పాపట బొట్టుపై వెలుంగు
పూర్ణచంద్రికా కిరణ ప్రపూర్ణ రుచిర
చంద్రరేఖనుగని ఇంద్రచాపమంచు
ఏల భావించి మది నిశ్చయించకుండు ?
ఆర్య ! మాధుర్యధుర్య ! సౌందర్యలహరి !
వివిధ దేవతాపూజిత వేదమాత !

వ్యాఖ్య

అమ్మా! నీ బంగారు కిరీటశోభ అనుపమానం అందులో వివిధరంగుల మణులు మాణిక్యాలు కూర్పబడి ఉన్నాయి ఆ మణులు నిజంగా ద్వాదశాదిత్యులే గోళాకారంగా గల నీ కిరీటరత్నకాంతులు అన్నీ కలిసి వినూత్న శోభను చిందిస్తున్నాయి నీ పాపట బొట్టుగా ఉన్న చంద్రరేఖ నిజంగా రత్నరంచితకాంతులతో ఇంద్రధనుస్సువలె శోభిస్తున్నది కవిచంద్రుడు నిన్ను దర్శించి నీ పాపటబొట్టు తిలకించి ఇది చంద్రరేఖ కాదు, ఇంద్రధనుస్సే అని స్థిరబుదితో నిన్ను ఉపాసిస్తున్నాడు తల్లీ!

★ ★

ముక్తాహార లసత్కిరీటరుచిరాం పూర్ణేందువక్త్రప్రభాం
శింజన్నూపుర కింకిణీమణిధరాం పద్మప్రభాభాసురాం
సర్వాభీష్ట ఫలప్రదాం గిరిసుతాం వాణీరమాసేవితం
మీనాక్షీం ప్రణతోఽస్మి సంతత మహం కారుణ్యవారాంనిధిమ్!

—మీనాక్షీ స్తోత్రం

# 43. నీలవేణి

ఘనీభూతం ధ్వాంతం న స్తులిత దళితేందీవర వనం
ఘనస్నిగ్ధశ్లక్ష్ణం చికుర నికురుంబం తవ శివే
యదీయం సౌరభ్యం సహజముపలబ్ధుం సుమనసో
వసంత్యస్మి న్మన్యే బలమథనవాటీ విటపినామ్

పద్యము

వాసవార్చిత! ఆశ్రిత పారిజాత!
వికచ కల్హార సుమహారవితతివోలె
స్నిగ్ధకోమల కాదంబినీ విధాన
నీలిమలుచిందు నీ కుంతలాలు తల్లి!
మాదు అజ్ఞానతిమిరమ్ము మాపుగాత!

త్రిభువనమహేంద్ర నందన దివ్యభూమి
వర్ధితోన్నత కల్పవృక్షవ్రజమ్ము
సహజ సౌగంధ్య సౌందర్య సారమంద
నీ కురులజేరుగద! జననీ! భవాని!
హే ఉమాబాల! శ్రీలలితేంద్రనీల
శకల సాదృశ్య కైశిక! సహజగంధ
బంధుర వినీలవేణి! ఈశ్వరుణిరాణి!

వ్యా ఖ్య

అమ్మా ! నీ ధమ్మిల్లం కడు శోభాయమానంగా ఉంది నీ కైశిక అనుపమాన సువికసిత ఇందీవరాల నిగారింపును తలవన్ను తున్నది నీ క్రొమ్ముడి నీలిమేఘాల సాంద్రసౌగంధ్యాన్ని ధిక్కరిస్తు న్నది మార్దవంతో సుగంధభరితమై సుందరాతిసుందరమయిన నీ కురులు మాలోపలి అజ్ఞానాంధకారాన్ని పరుగులు తీయించునుగాక ! సహజ సుందర సౌరభ సుగంధ భరితమైన నీ వెణిపై అలంకరణ మహాభాగ్యం పొందాలని మహేంద్రుని నందనోద్యాన కల్పవృక్ష కుసుమాలు వచ్చిచేరాయి భక్తజన కల్పవల్లి !

★ ★

ఉమాఽపి నీలాలకమధ్యశోభి
విస్రంసయంతీ నవ కర్ణికారం
చకార కర్ణచ్యుత పల్లవేన
మూర్ధ్నా ప్రణామం వృషభధ్వజాయ !

—కుమారసంభవము

## 44. సీ మ ం త ము

తనోతు క్షేమం న స్తవ వదనసౌందర్యలహరీ
పరీవాహ స్రోతస్సరణిరివ సీమంతసరణిః
వహంతీ సిందూరం ప్రబల కబరీభార తిమిర
ద్విషాం బృందైర్బందీకృతమివ నవీనార్కకిరణమ్

ప ద్య ము

అష్టమీచంద్రఫాల ! విద్యావిలోల !
భగవతీ ! భవదీయ సౌభాగ్యయోగ్య
వదన సౌందర్యలహరీ ప్రవాహభూమి
పంటకాలువ పొంగుగా వరలుచున్న
నీదు సీమంతమందు చెందిరము - కేశ
తిమిర రిపువర్గమెల్ల బందీయొనర్చి
పట్టికట్టిన ప్రాభాత బాలభాను
తెచ్చుచున్నట్లున్నది దేవమాత !
ఉదయకుంకుమారుణ నవాభ్యుదయకాంతి
కూర్మితో మాకు క్షేమమ్ము గూర్చుగాత !

వ్యాఖ్య

అమ్మా ! అబ్జవదనా ! కుందరదనా ! నీ వదన సౌందర్య లహరి కడు ప్రశంసనీయం నీ ముఖ లలిత లావణ్యలహరి నీ పాపట దారివెంట చక్కగా చీలి ప్రవహిస్తున్నది నీ నెరికురులు బందీగా పట్టు కొన్న అరుణకిరణాల బాలభానుణ్ణి నీ సీమంత సిందూరమార్గం లాక్కువస్తున్నదా అన్నట్లున్నది శుభప్రదమైన నీ సీమంతం శ్రీమంతమై మా యోగక్షేమాలు ప్రతినిత్యం చూచుగాక !

★ ★

భస్మరేఖాంకిత లసన్మస్తకాయై నమః
తాంబూలపూరిత స్మేరవదనాయై నమః

—తిమ్మన

# 45. నెమ్మోము

అరాళై స్స్వాభావ్యా దళికలభసశ్రీభిరలకైః
పరీతం తే వక్త్రం పరిహసతి పంకేరుహరుచిమ్
దరస్మేరే యస్మిన్ దశనరుచికింజల్కరుచిరే
సుగంధౌ మాద్యంతి స్మరమథనచక్షుర్మధులిహః

పద్యము

లలితసుందరతర తరళాయతాక్షి!
వంపుసొంపుల తేంట్ల మవ్వంపు లొలుకు
నొక్కునొక్కుల చక్కని చిక్కనైన
మెరుగుటందాల గుబురు ముంగురులచేత
ముద్దులందెడు నీదు నెమ్మోముతీరు
పరిహసించును కెందమ్మిసిరిని జనని!
తెలిజిగి ఒకింత దీపించు మొలకనగవు
లొలుకు పలువరుస హారంగు వెలుగుతీరు
పుష్ప కింజల్క సౌందర్యమును హసింప
పద్మగంధముచిందు నీ వదనమందు
స్మరహరుని నేత్ర మధుపాళి మరులచిక్కి
నిర్భరానంద మధువాను నీలవేణి!

వ్యా ఖ్య

అమ్మా ! నీ వదన సౌందర్యలహరి దర్శనీయం నొక్కులు తీరిన నీ ముంగురులు తుమ్మెద రెక్కల నైగనిగ్యాన్ని వెదజల్లు తున్నాయి ఆ తుమ్మెదలవంటి ముంగురులు మూగిన నీ ముఖం ముద్దులుగారు పొందామరనే గేలి చేస్తున్నది నవ్వినప్పుడు వెలువడే మల్లెమొగ్గలకు సరివచ్చు నీ పలుకాంతులతో నీ ముఖం పద్మ పరీ మళాన్ని విరజిమ్ముతున్నది నీ ముఖపద్మంపై మహేశ్వరుని వలపు చూపులు గండుతుమ్మెదలై వ్రాలుతున్నవి తల్లి ! మన్మథ విరోధిని నీ ముఖకమలం వశం చేసికొన్నదమ్మా !

★ ★

"కస్తూరీ తిలకీ భూత నిటలాయై నమః "

—లలిత అష్టోత్తరం

## 46. ఫాలబింబము

లలాటం లావణ్యద్యుతివిమల మాభాతి తవయత్
ద్వితీయం తన్మన్యే మకుటఘటితం చంద్రశకలమ్
విపర్యాసన్యాసా దుభయమపి సమ్భూయ చ మిథః
సుధాలేపస్యూతిః పరిణమతి రాకాహిమకరః

పద్యము

నీ లలాట లావణ్య సుస్నిగ్ధ శోభ
చంద్రికా కాంతులను వెదజల్లుచుండ
అర్ధచంద్రబింబమ్ముగా ఆత్మ తలచి
మకుటఘటితేందుఖండ మింకొకటిచూచి
ప్రీతి అరచందమామలు రెండు నొకట
జేర్చి వ్యత్యస్తముగ దిద్దితీర్చి చూడ
భవ్య సుందర భవదీయ బాలచంద్ర
మకుటశోభిత ఫాలబింబమ్ము అపుడు
నిండుచంద్రుడై పండువెన్నెలలు కాసె
నవరసాతీత సహజ సౌందర్యలహరి !
శివమనోహరి ! హిమగిరి శ్రీకుమారి !

వ్యాఖ్య

అమ్మా! నీ లలాటం అర్ధచంద్రవిలాసాన్ని వెలువరిస్తున్నది నీ తలపై గల రత్నకిరీటం అర్ధచంద్రుడి శోభ చిందిస్తున్నది ఈ రెండూ వ్యత్యస్తంగా ఉండటంవలన అందం మరీ పెరిగి రెండు అర్ధ చంద్రాలు కలిసి పూర్ణచంద్ర సౌందర్యాన్ని గుప్పిస్తున్నాయి కిరీట కోణాలు క్రిందికి, లలాట రేఖలు పైకి ఉండి పూర్ణత్వం గూర్చింది. అమ్మా! నీ వదనం సౌందర్యసదనమై పూర్ణచంద్రబింబమై భాసిస్తున్నది తల్లీ!

★ ★

అక్కుధరపుత్రి నాపున్
ముక్కంటికి వేఱులేదనుచు తెలుపుటకున్
మిక్కిలికను దాల్చెనగతి
చక్కని రారేక నెన్నొసల ధరియించెన్!

—వరాహ పురాణము

## 47. భ్రూ వి లా స ము

భ్రువౌ భుగ్నే కించిద్భువన భయభంగవ్యసనిని
త్వదీయే నేత్రాభ్యాం మధుకరరుచిభ్యాం ధృతగుణమ్
ధనుర్మన్యే సవ్యేతరకర గృహీతం రతిపతేః
ప్రకోష్ఠే ముష్టౌచ స్థగయతి నిగూఢాంతర ముమే

ప ద్య ము

లోకకంటక కార్య నిర్మూలన ప్ర
గాఢకాంక్షతో వెల్గు దుర్గాభవాని !
వర్ణనీయమౌ భవదీయ వదనమందు
వంపుతిరిగిన కనుబొమల్ సొంపులొలుకు
తుమ్మెదలబారువోలె అందమ్ముచిమ్మ -
కామ కమనీయ ధనువుగా కళలుచిలుకు -
నీలివర్ణమ్ములైన నీ నేత్రయుగము
చూపు పూ తూపులేసి ఈశుమది గెల్చు
అల్లెత్రాడుగా విల్లున అతిశయిల్లు
రతిమనఃపతి వామకరంపు ముష్టి
పట్టుచే నడిమింత కప్పబడియున్న
తరుణ సౌందర్య శృంగార ధనువటంచు
నీదు భ్రూవిలాసమ్ము వర్ణింతు తరుణి !
విశ్వకల్యాణి ! అరుణారవిందపాణి !

వ్యా ఖ్య

అమ్మా ! దయాస్వరూపిణీ ! జగత్కల్యాణీ ! ఆపన్నివా రిణీ ! నీ కనుబొమలు మన్మథుని ధనుస్సువలె భాసిస్తున్నది కనుగవ అల్లెత్రాడువలె అందగిస్తున్నది మన్మథుని విల్లు తుమ్మెదలజాలు నీ భ్రూయుగము తుమ్మెదలజాలువలె ఉన్నది మన్మథుడు మధ్యలో వింటిని పట్టుకొన్నాడా అన్నట్లు కనుబొమలమధ్య నాసికాప్రాంతం మన్మథుని పిడికిలి ముద్రవలె భాసిస్తున్నది

★ ★

తస్యాశ్శలాకాంజన నిర్మితేవ
కాంతిర్భ్రువో రాయతలేఖయోర్యా
తాం వీక్ష్య లీలాచతురామనంగః
స్వచాప సౌందర్యమదం ముమోచ

—కుమారసంభవము

## 48. మూడు కన్నులు

అహస్సూతే సవ్యం తవ నయనమర్కాత్మకతయా
త్రియామాం వామం తే సృజతి రజనీనాయకతయా
తృతీయా తే దృష్టి ర్దరదళితహేమాంబుజరుచి
స్సమాధత్తే సంధ్యాం దివసనిశయో రంతరచరీమ్

పద్యము

తల్లి! ఓ విశాలాక్షి! నీ దక్షిణాక్షి
కమలబంధువై పగటిని కలుగజేయు -
వామనేత్రమ్ము నవ కైరవప్రియుడయి
తీపి వెన్నెల చిందు రాత్రిని సృజించు -
దర వికసితారుణ సువర్ణ సరసిజమ్ము
అనగ రాజిల్లు నీ తృతీయ నయనమ్ము
ఉభయసంధ్యల సృష్టించుచున్నదమ్మ!
అఖిలకాలప్రణేత్రి! కళాఖినేత్రి!
సకల లోకైకజనయిత్రి! జలజనేత్ర!
ధాత్రి! సావిత్రి! గాయత్రి! ఓ త్రినేత్ర!

వ్యాఖ్య

అమ్మా ! త్రినేత్రా ! పరమపవిత్రా ! నమస్కారమమ్మా !

నీ దక్షిణ నేత్రం సూర్యదేవుడై పగటిని కలుగజేస్తున్నది నీ వామనేత్రం మనోజ్ఞంగా వెన్నెల రాత్రులను సృష్టిస్తున్నది. బంగారుచాయగల నీ తృతీయ నేత్రం ఉభయ సంధ్యావేళలను వెలువరిస్తున్నది. ఇలా సమస్త కాలస్వరూపిణివై సంవత్సర ఋతుశోభతో జగత్తుకు చైతన్యదీప్తి నందిస్తున్నావు తల్లీ ! సర్వమంగళా ! నీ కన్నులే కాలచక్రాలు ! నీవు సమయి స్వరూపిణివి

★ ★

కదంబ వనవాసినీం కనకవల్లకీ ధారిణీం
మహార్హమణిహారిణీం ముఖసముల్లసద్వారుణీం
దయావిభవకారిణీం విశదలోచనీం చారిణీం
త్రిలోచన కుటుంబినీం త్రిపురసుందరీ మాశ్రయే !

—త్రిపురసుందరీ స్తోత్రం

## 49. సౌందర్యలహరి

విశాలా కల్యాణీ స్ఫుటరుచి రయోధ్యా కువలయైః
కృపాధారాఽధారా కిమపి మధురాఽభోగవతికా
అవంతీదృష్టి స్తే బహునగర విస్తారవిజయా
ధ్రువం తత్తన్నామవ్యవహరణయోగ్యా విజయతే

పద్యము

అతి 'విశాల'మై పరమ 'కల్యాణి'యై సు
వికసితోత్ప 'లామోధ్య'యై విపుల కరుణ
ధార కా'ధార'మై సుధా ద్వైత పూత
'మధుర'మై కళా కమనీయ మహిత లలిత
'భోగవతి'యై అతుల గుణ త్యాగపూర్ణ
పండితా 'వంతి'యై జగన్మండలమ్ము
లైన 'విజయ' పతాకమై పరిణమించి
అమ్మ! భవదీయ కరుణా కటాక్ష రోచి
భక్తి సంరక్షణమొనర్చ వ్యాప్తమగుచు
అష్టనగర నామ విశేషణాఖ్యలంది
అంబ! మహనీయమై సదా అలరుగాదె
దర్శనవిహారి! విశ్వసౌందర్యలహరి!

వ్యాఖ్య

అమ్మా! విశాలాక్షీ! కల్యాణి! నీ కడకంటిచూపు అష్ట విధాలుగా ప్రసరింపబడి గుణవిశేషాలతో ఆయా నగరాలై ప్రకాశిస్తున్నాయి నీ చూపు విశాలమై అంతర్వికాసంతో కూడి విశాల నగరమై వెలిసింది నీ దృష్టి విస్మితమై చిరునవ్వుతో కూడి కల్యాణకరమై కళ్యాణి నగరమయింది మొలకనవ్వుతో కూడి నల్లకలువల అందాలు చిందిస్తూ జయించుటలో ఎవరికీ సాధ్యంకాక నీ చూపు అయోధ్యా నగరమై వన్నెకెక్కింది అవ్యక్తం మధురం మనోజ్ఞం వలయితం అయి నీ పిడపంటి చూపు మధురానగరమై భాసించింది నీ కృపాదృష్టి పరిపూర్ణ వైశాల్యం కలిగి ఆభోగము కలదై స్నిగ్ధమై భోగవతి అనే సార్థకనామం ధరించింది నీ చల్లని చూపు సుందరమై భక్తజనావనమై ఆశ్రిత రక్షణకు సిద్ధగి అవంతీపురి అయింది నీ కటాక్షం విజయశ్రీకరమై విజయ అనే పేరుగల నగరమై వెల్లివిరిసింది

 

శబ్దబ్రహ్మమయీ! చరచరామయీ! జ్యోతిర్మయీ! వాఙ్మయీ!
నిత్యానందమయీ! నిరంజనమయీ! తత్త్వంమయీ! చిన్మయీ!
తత్త్వాతీతమయీ! పరాత్పరమయీ! మాయామయీ! శ్రీమయీ!
సర్వైశ్వర్యమయీ! సదాశివమయీ! మాంపాహి మీనాంబికే!

## 50. ఆకర్ణనేత్ర

కవీనాం సందర్భ స్తబక మకరందైకరసికం
కటాక్షవ్యాక్షేప భ్రమరకలభౌ కర్ణయుగళమ్
అముంచంతౌ దృష్ట్వా తవ నవరసాస్వాదతరళౌ
అసూయాసంసర్గా దలికనయనం కించిదరుణం

పద్యము

స్వర్ణదేహా! అపర్ణ! ఆకర్ణనేత్ర!
కవివరేణ్యులు వినిపించు శ్రవణసుభగ
నవరసవిలాస మల్లికా నవశిరీష
కావ్యమధుపాను మమత నీ కర్ణయుగళి
చెవుల సామీప్య మరిగి వాచవినిసొక్కి
తన్మధురసమ్ము మనసార త్రావుచుండె
వ్రతముపట్టిన యజ్ఞదీక్షితులవోలె
అద్రిజా! నీ కటాక్ష మత్తాళియుగళి
వాలుకనుల అదృష్టమ్ము స్వాంత మెంచి
నీ తృతీయాక్షి కీర్ష్య జనించెనమ్మ!
కానిచో రక్తతిలకమ్ముగా రవంత
ఏల నీ ఫాలనేత్రమ్ము ఎఱ్ఱవడెను?
నగపతికుమారి! శంకరానందలహరి!
శివుని అర్ధాంగి! ముకురమీక్షించుకొమ్మ!

వ్యాఖ్య

అమ్మా! పార్వతీ! భవానీ! ఈశానీ! కవీశ్వరులు నిన్ను గూర్చి కమనీయ కవితావిలాసాలు కురిపిస్తున్నారు నీ వీనులు పరమానందంతో వాటిని ఆలకిస్తున్నాయి దీనిని గ్రహించిన నీ రెండు కన్నుదమ్ములు చూపులు అనే నెపంతో చెవులదాకా ప్రాకి మధుర రసాన్ని ఆస్వాదిస్తున్నాయి ఇది చూచి నీ తృతీయనేత్రం చెవులదాకా వెళ్లటం సాధ్యంకాక కనులపై కినుక వహించిందా అన్నట్లు కొంచెం ఎర్రగా చూస్తున్నదమ్మా!

★ ★

"ఊరక చుట్టుకొన్న కమలోత్పలపంక్తులు వాడునంచునో
యేఱును గూర్చి చుట్టితివి! ఎంతటి జాణవు! మేలు మేలు నీ
నేరుపు మెచ్చవచ్చు" నని నిచ్చలు మచ్చిక శంభుగేరు నీ
హార గిరీంద్రకన్యక దయామతి కోర్కులు మా కొసంగుతన్!

—కంకంటి పాపరాజు

## 51. రసమయి

శివే శృంగారార్ద్రా తదితరజనే కుత్సనపరా
సరోషా గంగాయాం గిరిశనయనే విస్మయవతీ
హరాహిభ్యో భీతా సరసిరుహ సౌభాగ్యజననీ
సఖీషు స్మేరా తే మయి జనని దృష్టిస్సకరుణా

పద్యము

శివుని శృంగారవార్ధి వీచికల తేల్చి
అరుల భీభత్సరసమున హడలగొట్టి
సవతి గంగను రౌద్రరసాన జూచి
పురహరుని గాథవినుచు అద్భుతముపొంది
భవుని భుజగహారాలకు భయమునంది
కైరవాక్షుల రక్తిమకాంతియందు
వీరరసరేఖ సుంత భావింపజేసి
సఖులభావల కత్యంత సరసమైన
భ్రూచలనముల హాస్యమును సృజించి
భక్తి జపియించు మాపై అపారమైన
కరుణ వర్షింపజేసి నీ కంటిచూపు
అష్టవిధ రసరూపిణివై వెలుంగు
అష్టతను విరాజితుని అర్ధాంగలక్ష్మి
ఆర్య! తత్వమాధుర్య! సౌందర్యలహరి!

వ్యాఖ్య

అమ్మా! ఓ జననీ! నీ కటాక్ష వీక్షణం క్షణం క్షణం ఎన్ని రూపాలు దాలుస్తుందమ్మా! ఎన్ని రసాలు చిందిస్తుంది తల్లీ! పరమ శివుణ్ణి చూస్తున్నంతసేపూ శృంగార సుకుమార భావప్రసారం చేస్తుంది. అన్యుల్ని అవలోకించేటప్పుడు ముకుళించుకుపోతుంది గంగాదేవిని చూచినప్పుడు రోషకషాయితమవుతుంది ఫాలనేత్ర ప్రభువు త్రిపుర సంహార వీరగాథలు వినే సమయంలో అద్భుత రసాదులు వెల్లడిస్తుంది హరుని కంఠంలోని మహానాగాలను దర్శించినపుడు నీ చూపు కళవళపడి భయానకరసం ఒలికిస్తుంది అలవోకగా నీ కను కొనల వెడలు అరుణారుణిమ కాంతులు నీ సౌభాగ్య గరిమను చిందిస్తున్నది తల్లీ! చెలికత్తెలను చూచినంతసేపూ నీ చూపులు దరహాస మధుర చంద్రికలను వెదజల్లుతున్నాయి నన్ను చూస్తున్నంతసేపు కరుణరసం చిలికిస్తావు అమ్మా! అభివాదాలు!

★ ★

ఆమె భువనైకమోహిని - అమృతమయి అ
నంత విశ్వ విహారిణి - శాంతమూర్తి -
ఆమె లోకైక పావని - ఆమె వంటి
అందముల రాణి లేదు - బ్రహ్మాండమందు!

—కరుణశ్రీ

# 52. వాలుకనులు

గతే కర్ణాభ్యర్ణం గిరుత ఇవ పక్ష్మాణి దధతీ
పురాం భేత్తు శ్చిత్తప్రశమరస విద్రావణఫలే
ఇమే నేత్రే గోత్రాధరపతి కులోత్తంసకలికే
తవాకర్ణాకృష్ట స్మరశరవిలాసం కలయతః

పద్యము

హైమగోత్ర మహాసార్వభౌమ వంశ
మస్తకముపైని పైడి చేమంతి పూవ!
మేనకారాణి రతనాల మేడలోన
అందగించిన పున్నమి చందమామ!
విశ్వ సౌందర్యరూపిణి! వేదవాణి!
తరుణి! నటరాజవలపుటుందాలరాణి!
భక్తివరదాయినీ! సుధాపద్మపాణి!
నా మనఃకమల నివాసినీ! మదంబ!
మన్మథవిరోధి మనసులో మరులుగూర్ప
రమ్య పద్మముల్ కంకపత్రములు కాగ
మరుడు చెవిదాకలాగిన శరములట్లు
నీ కనులు సోలి వీనులన్ దాకుచుండె!

వ్యాఖ్య

అమ్మా ! హిమవత్పర్వత సార్వభౌమకుమారీ ! నీ నేత్రాలు నీ వీనుల వరకు వ్యాపించి ఆదిర్ఘాయతలోచన అనే పేరు పొందావు నీ కలువకంటి చూపులు మారుని తూపులై దూసుకుపోతున్నాయి ఆ తూపులకు ఇరువైపుల కట్టిన గ్రద్ద ఈకలవలె నీ కంటిరెప్పల వెంట్రుకలు వింతసోయగాలు క్రుమ్మరిస్తున్నాయి ఆ నీ చూపు తూపులు త్రిపురవైరిలోని నిస్పృహ తొలగించి శాంతరసాన్ని ఎండించి శృంగారరసాన్ని ఊరిస్తోందమ్మా ! మన్మథ పంచసాయకంతో సమాన మైనది నీ వలపు చూపు

★ ★

వీణానాద నిమీలితార్ధనయనే ! విస్రస్తచూళీభరే !
తాంబూలారుణ పల్లవాధరయుతే ! తాటంక హారాన్వితే
శ్యామే ! చంద్రకళావతంసకలితే ! కస్తూరికా ఫాలికే !
పూర్ణేకైరవబంధురూప వదనే ! మాంపాహి మీనాంబికే !
—మీనాంబికా స్తోత్రం

## 53. నేత్రత్రయము

విభక్తత్రైవర్ణ్యం వ్యతికరిత లీలాంజనతయా
విభాతి త్వన్నేత్రత్రితయ మిద మీశానదయితే
పునస్స్రష్టుం దేవాన్ ద్రుహిణహరిరుద్రానుపరతాన్
రజ స్సత్వం బిభ్రత్తమ ఇతి గుణానాం త్రయమివ

పద్యము

ఓ మహాదేవ దేవీలలామ ! నీ మ
నోహరతర సుందర వదనమ్ముపైని
అర్థవలయిత నేత్రత్రయమ్ము ఉజ్జ్వ
లాంజనాలంకృతంబయి అందగించె
మూడురంగుల కలయిక రూపుతేని
కాంతులను వెదజల్లు నీ కనులు మూడు
ముఖ్యమైన సత్వరజస్తమోగుణాలు
మూడుగా ప్రకాశించు నీ మూడుకనులు
నీకు ప్రీతిపాత్రులు నిన్ను నిండుహృదిని
ధ్యానమొనరించి నీలోన లీనమై స
దా ప్రవర్తిల్లు పరిపూర్ణ తత్వవిదులు
బ్రహ్మ విష్ణు మహేశ్వర ప్రముఖ సురల

సృష్టిసంధానకర్తలన్ సృష్టిసేయు
మూలశక్తిప్రదాలు నీ మూడు కనులు
ముజ్జగములమ్మ ముక్కంటి ముద్దుగుమ్మ
నీ త్రినేత్ర కారుణ్యకాంతికి నమస్సు !

వ్యాఖ్య

అమ్మా ! మహాదేవ మహిషి ! నీ మూడు నేత్రాలకు పెట్టుకొన్న అందమైన అంజన రేఖలు చాలా మనోహరంగా ఉన్నాయి అవి చూడచక్కని అర్ధవలయాకారాలలో అనేక మధురోహాలు కలిగిస్తున్నాయి నీ కనుల కాటుక రేకలతో త్రివర్ణాలకు అందమైన హద్దులు గీచినట్లున్నాయి జగత్ ప్రళయంలో బ్రహ్మవిష్ణురుద్రులు లీనమైపోతారు అపుడు జగత్తు నిరామయంగా ఉంటుంది మరల సృష్టి చేయవలసి వస్తుంది ఆ సమయంలో ఆ దేవప్రభువులైన బ్రహ్మ విష్ణురుద్రులను సృష్టి చేయటానికి ఆ త్రిగుణాలు నీ కనులలో నిలిపావు సత్వరజస్తమోగుణాలు నీవు దాచిన విధం చెప్పక చెపుతున్నాయి, నీ కజ్జలాలు

## 54. వీక్షణాలు

పవిత్రీకర్తుం నః పశుపతిపరాధీన హృదయే
దయామిత్రైర్నేత్రైః అరుణధవళశ్యామరుచిభిః
నద శ్శోణో గంగా తపనతనయేతి ధ్రువ మయం
త్రయాణాం తీర్థానా ముపనయసి సంభేద మనఘమ్

పద్యము

పరమసౌందర్య శంకరైశ్వర్యమూర్తి
పశుపతికి మనఃకమల మర్పణముచేసి
హరపరాధీనమైన ప్రేమార్ద్రహృదయ !
లలిత లలితాంబ ! భక్త కల్పద్రుమంబ !
అతి పవిత్రాలు పరమ దయాకరాలు
అఘలవిత్రాలు అమృత రసాకరాలు
నీదునేత్రాలు సౌదామినీకరాలు
స్వర్ణ సౌవర్ణ పద్మకేసర పరాగ
బాలభాను సుందర మయూఖాలు గ్రాలు
శోణ నద తరంగాలు శర్వాణి ! ఒక్క
అక్షికొననుండి వచ్చెడి వీక్షణాలు
శారదేందు తుషార మందార హార
రమ్య మందాకినీ తరంగాలు గ్రాలు
అమృత గంగాప్రవాహాలు — అంబ ! ఒక్క
అక్షికొననుండి వచ్చెడి వీక్షణాలు

కృష్ణవర్ణ విరాజిత విష్ణుపదవి
హీర కాదంబినీ ప్రవాహాలు గ్రాలు
మధుర యమునా తరంగాలు మాత ఒక్క
అక్షికొననుండి వచ్చెడి వీక్షణాలు
మా త్రిజన్మ సంచిత పాపములను కడిగి
మము పవిత్రులసేసి శ్రేయములనీయు
నీ త్రినేత్ర ప్రసారకాంతిత్రయమ్ము
శ్రీ త్రివేణీ ప్రయాగ చేసితివి నిజము!

వ్యాఖ్య

అమ్మా! పరమేశ్వర ప్రాణప్రియా! దయార్ద్రహృదయా! నీ నేత్రాలు పరమపవిత్రాలు అతి చిత్రాతి చిత్రాలు పాపలతా లవిత్రాలు నీ మూడు కన్నులు మూడురంగులు సింగారించుకొని సోయగాలు చిందిస్తున్నాయి ఒక కన్ను సితపుండరీకంగా మరో కన్ను అరుణాబ్జంగా ఇంకొక కన్ను నీల కల్హారంగా కమనీయంగా దర్శనం ఇస్తున్నాయి ఆ త్రినేత్రాలు త్రిగుణ త్రివర్ణ పూర్ణశోభితాలు అవి త్రివర్ణరాగ రంజితాలు వేదత్రయ ప్రబోధకాలు అవి సార్థక సుతీర్థాలు ఒకటి శోణనదీసౌందర్యం విరజిమ్ముతున్నది మరొకటి గంగాభాగీరథీ తీర్థమై ప్రకాశిస్తున్నది మూడవది సూర్యసుత యమునాపునీత పుణ్యసీమంతినియై సాక్షాత్కరిస్తున్నది నీ వదనసరోజం త్రివేణీ మహాపుణ్యతీర్థ రాజమయి భాసిస్తున్నది అమ్మా! నీ ముఖ సందర్శనం మా పాప పంకాన్ని కడిగి మమ్ము పునీతుల్ని చేయుగాక!

## 55. నిమేషోన్మేషములు

నిమేషోన్మేషాభ్యాం ప్రళయముదయం యాతి జగతీ
తవే త్యాహు స్సంతో ధరణిధర రాజన్యతనయే
త్వదున్మేషాజ్జాతం జగదిద మశేషం ప్రళయతః
పరిత్రాతుం శంకే పరిహృతనిమేషా స్తవదృశః

పద్యము

ధరణిధర రాజపుత్రి ! సౌందర్యగాత్ర !
విపుల శీతపత్రనేత్ర ! ఓ విశ్వధాత్రి !
ప్రేమరూపిణి ! కళ్యాణి ! ప్రియభవాని !
గౌరి ! కాత్యాయనీ ! తల్లి ! కల్పవల్లి !
అమ్మ ! కనురెప్ప వాల్చితివా ! లయంబె
ఈ మహా విశ్వమెల్ల నశించబడును
అమ్మ ! కనురెప్ప విప్పితివా ! సుఖంబె
ఈ మహా విశ్వమెల్ల సృజింపఁబడును
నీ నయన నిమేషోన్మేష నిహితమునన
అమ్మ ! విధ్వంస సృష్టికార్యములు జరుగు
జగతి నటనమ్ము నీ కనుసైగచేత
సాగిపోవునుగాదె ఈశ్వరుని రాణి!
నీ మహాశక్తి తత్త్వమున్ — నీ కృపా ప
రత్వమున్ నీ పటుత్వ మహత్త్వములును
వ్యాసమున్యాది నీ భక్తవర్య లమిత
నమ్మకమ్ముగ చెప్పినారమ్మ స్మృతుల

నీవుగన్న సంతానమ్ము — నీ గృహమ్ము
ఎచట నశియించునోయని ఇంతగూడ
రెప్పవాల్చకయుంటివి చెప్పనేల ?
నీవు అనిమిషవైతివి నిజము నిజము
కన్నతల్లిమనస్సు కన్గొన్నదెవరు ?
అమ్మ హృదయమ్ము ఎవరికి అర్థమగును ?
జనని ప్రేమామృత ఝరికి సాటియేది ?
అనుపమానమ్ము అదియె బ్రహ్మాండమందు
జనని ! గాయత్రి ! జగదధిష్ఠానవిత్రి
మాతృదేవతామూర్తి ! ఉమాకుమారి !

వ్యాఖ్య

అమ్మా ! ఓ శీతాద్రిరాజతనయా ! చల్లనితల్లీ ! "నీవు కన్నువిప్పార్చి చల్లగాచూస్తుంటే జగత్తు సుస్థితిలో జీవిస్తుంది నీవు కంటిరెప్పవాల్చావు అంటే జగత్తుకు మహా ప్రళయమే" అని వ్యాస మహర్ష్యాదులు చెప్పగా విన్నాను విశ్రాంతి లేకుండా నిత్యం జగత్కల్యాణం కోరి కనురెప్ప వేయకుండా లోకాలను చల్లగా పాలి స్తున్నావా ! తల్లీ ! లోకాలలోని ప్రాణికోటి కోసం ఎంత శ్రమ తీసికొంటున్నావు అమ్మా !

అందుకనే అనిమేషులకు అమ్మవై అనంతరం అనిమేషవై నీ కన్నబిడ్డలను కంటికి రెప్పలాగా కన్నుల్లో ఉంచుకొని కాచు కొంటున్నావా ! అమ్మా ! లోకమాతా !

## 56. మీననేత్రములు

తవాపర్ణే కర్ణే జపనయన పైశున్య చకితాః
నిలీయంతే తోయే నియత మనిమేషా శ్శఫరికాః
ఇయంచ శ్రీ ర్బద్ధచ్ఛదపుట కవాటం కువలయం
జహాతి ప్రత్యూషే నిశిచ విఘటయ్య ప్రవిశతి

### పద్యము

ఓ అపర్ణా! సువర్ణ! కర్ణాయతాక్షి!
నీ శ్రవణములదాకిన నేత్రయుగళి
తమ రహస్యాలు వెల్లడించునో యటంచు
భయముతో ఆడు మీనముల్ పరుగులెత్తి
నీటి అడుగున రూపు కన్పింపకుండ
దాగుకొని రెప్పవాల్చక దశదిశలను
నిశ్చలత తేనిపై గమనించుచుండె
దేవి! పార్వతీ! తల్లి! ఇందీవరాక్షి!
నీ మనోహర సువిశాల నేత్రయుగళి
చిందులాడెడు కాంతి లక్ష్మీకుమారి
తలుపురేకులు మూయగా కలువపడకు
పగటివేళల జనక — మాపటికి మాత్ర
మెల్లొ రేకులు విడదీసి ఏగుకొంత

వ్యాఖ్య

అమ్మా! అపర్ణా! ఆకర్ణాయతలోచనా! నీ మధురమంజుల నేత్రాలు మత్స్యకన్యలకు చెలికత్తెలు కాబోలు లోపరకటణాకై నీవు పూనిన అనిమేష కళానైపుణ్యాన్ని ఆ మత్స్యకన్యకలూ సరదాగా అనుకరిస్తున్నాయి నీ చంచల నేత్రాంచలాలు నీ పిసులవంకకు వెళ్ళినపుడు ఆడు బేడిసలు ఈ అనుకరణదౌష్ట్యాన్ని కన్నులు ఎక్కడ చెవులలో ఊదుతాయో అనుకొని మిక్కిలి భయపడి నీ కన్నులకు ఓడి నీకు కనిపించకుండా లోతైన నీళ్ళలో అడుగున దాక్కున్నాయి ఆ చేపలు కనిపించలేదని కాబోలు నీ కనుల కమనీయ కాంతిశ్రీలు పగలు నీ నేత్రకమలాలలోనూ రాత్రివేళ కలువ పూల రేకులతలుపులు తెరచుకొని ఇందీవరాలలోనూ ఆ జలాల పైనే నివసిస్తున్నాయి తల్లీ! చెలిమి బలిమి అంతటిది కాబోలు.

★ ★

కమలనయన! నీవు కలచోటు సరసంబు
నీవు లేనిచోటు నీరసంబు;
కంబుకంఠి! నీవు కలవాడు కలవాడు
నీవు లేనివాడు లేనివాడు!

—కాశీఖండము

## 57. దయాదృష్టి

దృశా ద్రాఘీయస్యా దరదళితనీలోత్పలరుచా
దవీయాంసం దీనం స్నపయ కృపయా మామపి శివే
అనే నాయం ధన్యో భవతి నచ తే హాని రియతా
వనే వా హర్మ్యే వా సమకరనిపాతో హిమకరః

గీతము

బాల! శ్రితదానశీల! గుణాలవాల!
నల్లకలువల నిగ్గుటంబాల నేలు
నీ సుదీర్ఘ కటాక్ష కాంతి ప్రసార
యామున తరంగములలోన - అమ్మ! నీకు
దూరముగనున్న ఈ దీన దుష్టమతిని
గూడ కృపతోడ తడిపిన - కోటిజన్మ
పాపజాలమ్ము విడనాడి - పావనుడగు
ఇంతమాత్రమ్ముచేత నీ కేమికొరత ?
మాత! దయజూడవే! మంత్రపూతచరిత!
నా అభీష్టమ్ము యుక్తమైనదికదమ్మ
చంద్రుడు వనాన భవనాన చంద్రికలను
ఒక్కరీతిగా కురిపించుచుండుగాదె
అమృతధారాప్రదాయినీ! అన్నపూర్ణ!

వ్యాఖ్య

అమ్మా! అమ్మలగన్న అమ్మా! అతిదయాంబురాశివి గదమ్మా! నీ కలువకంటి కడకంటి చూపులోని కనికారం కాస్తంత నాపై కురిపించు తల్లీ! దానితో ఈ పతితుడి జీవనమే మారిపోతుంది. అపుడు వీడు పవిత్ర జీవనుడౌతాడు అమ్మా! దీనివల్ల నీకు నష్టం ఏమీ లేదుకానీ నాకుమాత్రం మహోపకారం చేసిన దానవవుతావు. మహా లబ్ధి కలిగించిన దానవవుతావు నీ మేలు మరచిపోను నీకు దాసదాసుణ్ణై అలానే జీవితాంతం సేవిస్తుంటాను

మహాత్ముల స్వభావమె ఇంత అందరినీ సమానంగా చూస్తారు అందరికి ఆ మృతలబ్ధి కలిగిస్తారు అనుపమదయాశీలి అమృతాంశుడున్నాడంటే అతడు తన చల్లని అమృత కిరణాలు వనాలపైన రాజభవనాలపైనా దీనహీనజనాలపైనా సమానంగా ప్రసరింపజేస్తాడు నీవు అతగాడికంటే ఈ గుణంలో ఇంకా అధికం నీకు అందరూ సమానమే నన్ను కటాక్షించు కన్నతల్లీ!

★ ★

అంబికకు పుట్టినిల్లు నీహారశిఖరి
అత్తవారిల్లు కాశీమహాపురంబు
హిమకరోత్తంసునకు పుట్టినిల్లు కాశి
అత్తవారి గృహంబు నీహారశిఖరి

—కాశీఖండము

## 58. క ణ త లు

అరాళం తే పాళీయుగళ మగరాజన్యతనయే
నకేషా మాధత్తే కుసుమశరకోదండ కుతుకం
తిరశ్చీనో యత్ర శ్రవణపథ ముల్లంఘ్య విలసన్
అపాంగ వ్యాసంగో దిశతి శరసంధానధిషణామ్

### ప ద్య ము

అద్రిరాజన్య మాన్య కన్యాలలామ !
నీ శ్రవణ నేత్రములమధ్య నిగ్గులొలుకు
పాళియుగళంబు రుచిర సౌభాగ్యమంది
అలరువిల్కాని వింటి సోయగము మించు
రడునిడుదయైన నీ కడకంటిచూపు
శ్రవణపథమును లంఘించి సాగుచుండ
మరుడు చెవిదాకలాగిన శరమటన్న
భ్రాంతి కలిగింపకుండునా ! భవునిరాణి
ఎవడు నీ పేరు కీర్తింప కెట్టులుండు ?

వ్యా ఖ్య

అమ్మా ! అగరాజస్యైకన్యా ! మాన్యా !

నీ అపాంగ వీక్షణామృతవీచికలు వక్త్రపాళికలపైన పరమ రమణీయంగా ప్రసరిస్తున్నాయి అవి మన్మథస్వామి సుదీర్ఘ కరాల లోని మహాశరాలవలె భాసిస్తున్నాయి ఆశరాలు నీ శ్రవణాలను దాటి బాగా లాగి మరుడు విడుస్తున్నాడా అన్నట్లున్నాయమ్మా ! అవి ఎంత మనోహరాలు ! ఆ మరుతూపులు మరునిమిషంలో మహాదేవుణ్ణైనా ఇట్టే కరిగిస్తాయమ్మా !

★ ★

"శ్రీమన్మహాదేవి ! విద్యా ! యవిద్యా ! మహాభాగ ! గంభీర జంభారి ముఖ్యామర ద్రోహివాహారి దైతేయ బాహాం తర స్థాసిత స్థూల శూలాపహేలా చలత్కింకిణీ కంకణ క్రేంక్రియా వాచాలతా శాంతరాశా ! కరాశా ! మరాళాధి రూఢా ! విరూపాక్షియుజ్యా ! జగజ్జాలపూజ్యా ! మహోంకార చాపజ్య ! సర్వేశ్వరీ ! "

—వరాహ పురాణము

## 59. వదనబింబము

స్ఫురద్గండాభోగ ప్రతిఫలిత తాటంకయుగళం
చతుశ్చక్రం మన్యే తవ ముఖమిదం మన్మథరథమ్
య మారుహ్యద్రుహ్య త్యవనిరథ మర్కేందు చరణం
మహావీరో మారః ప్రముథపతయే సజ్జితవతే

పద్యము

పరమసౌందర్య లావణ్య వరశుభాంగి!
తళుకులీనెడు చెక్కుటద్దాలపైన
ప్రతిఫలించె తాటంకచక్రముల జంట
తల్లి! అపుడు నీ మధుర సుందర ముఖమ్ము
నాల్గుచక్రాల మరుతేరు నా వెలింగె
అనమశరుడీ యమోఘంపు టరదమెక్కి
అప్రతిహత ప్రతాప శౌర్యమ్ముతోడ
బ్రభ్న విధుచక్రఘటిత భూరథి పురారి
పైకి వెడలుచున్నాడు సౌభాగ్యవల్లి!

వ్యాఖ్య

అమ్మా! నీ చెక్కుటద్దాలు నిగ్గుటద్దాలు అవి అతి సుంద రాలు మహాదేవ మనోహరాలు సుశ్రీకరాలు అవి సువిశాలాలు. చంద్రకాంతమణి శకలాలు ఆ చెక్కుటద్దాలలో నీ రత్నరంజిత తాటంకాలు పెద్దపెద్ద చక్రాలవలె ప్రతిఫలిస్తున్నాయి ఈ ప్రతిఫలనం వలన తాటంక చక్రాలు రెండూ నాలుగై భాసిల్లుతున్నాయి ఈ నాలుగూ మన్మథరథం పూన్చిన నాలుగు చక్రాలై శోభిస్తున్నాయి నీ మనోరథం తీర్చటానికి మారుడీరథం అధిష్ఠించి అతిలోకశూరుడై వస్తున్నాడమ్మా! భూమియే రథంగా సూర్యచంద్రులే రథచక్రాలుగా చేసికొని త్రిపురాసురులపై దండెత్తివెళ్ళే మహారుద్రుడైన నీ పతిపైనే బాణాలు రువ్వటానికి సిద్ధపడుతున్నాడమ్మా అలరువిల్కాడు!

★ ★

కర్పూరగౌరం కరుణావతారం
సంసారసారం భుజగేంద్రహారం
సదారామంతం హృదయారవిందే
భవం భవానీసహితం నమామి!

## 60. కర్ణకుండలములు

సరస్వత్యా సూక్తీ రమృతలహరీ కౌశలహరీః
పిబంత్యా శ్శర్వాణీ శ్రవణచుళుకాభ్యా మవిరళమ్
చమత్కార శ్లాఘా చలితశిరసః కుండలగణో
ఝణత్కారై స్తారైః ప్రతివచన మాచష్ట ఇవ తే

పద్యము

జనని ! శర్వాణి ! నీదు సౌజన్యవాణి
ధ్వని చమత్కార మధుర సత్యప్రియమ్ము
లసదలంకార శృంగార లాలితమ్ము
అమృతరసతరంగ ప్రవాహము గదమ్మ
వాణి బ్రహ్మణి నీ సుధా వాగ్రసమ్ము
చెవుల దోసిళ్ల తెగత్రాగి మివుల అద్భు
తం బమోఘం బనుభవ భావంబుపొందు
మాటిమాటికి మెయి గగుర్పాటుజెందు
కనులు విస్ఫారితమ్ములై కాంతిజిమ్ము
కడు ప్రశంసాత్మకమ్ముగా తడవతడవ
తలయు కంపించు కర్ణభూషల రవాలు
మోదసూచిత కరతాళ నాదములును
హస్త కంకణధ్వనులు ఆర్యా ! భవాని !
నీకు వాణి ప్రతివచన నికరమయ్యె !

వ్యాఖ్య

అమ్మా! శర్వాణీ! నీ వాణి ఎంత మనోహరమమ్మా! నీ వాణి మధురవాణి, అమృతంపు బాణి సంగీత ప్రథమశ్రేణీసరణి అది సుధాలహరి వివిధ గుణ కౌశలహరి అతి మనోహరి ఇట్టి నీ వాఙ్మాధురీఝరిని శ్రీవాణి చెవులప్పగించి వింటున్నది మారుమాట్లాడ లేకపోతున్నది తల ఊపుతున్నది అరచేతులు చరుస్తున్నది రోమాంచ అవుతున్నది "ఔర! ఔర!" అని ఆశ్చర్యపోతున్నది పరవశ యవుతున్నది. ఈ చిత్తవికార సీత్కార చమత్కారాల వలన శారదాదేవి శ్రవణాభరణాదులు ఝుణఝుణత్కారాలు చేస్తున్నా యమ్మా! అపుడెలా ఉన్నదంటే - నీ కలకంఠారావానికి సరస్వతి నోరెత్తలేదని ఆ అభరణాలే ప్రశంసాపూర్వ ప్రతివచనాలు పలుకు తున్నాయేమో అనిపిస్తున్నది

★ ★

మంత్రములలోన గాయత్రి మహిమగాంచు
నగరములలోన కాశి యున్నతివహించు
దైవతంబులలో సుధాధామమౌళి
విశ్వనాథుండు ప్రాధాన్య విభవమొందు!

—కాశీఖండము

## 61. నాసిక

అసౌ నాసావంశ స్తుహినగిరివంశధ్వజపటి
త్వదీయో నేదీయః ఫలతు ఫలమస్మాక ముచితం
వహత్యంత ర్ముక్తాః శిశిరకర నిశ్వాస గళితం
సమృద్ధ్యా యత్తాసాం బహిరపి చ ముక్తామణిధరః

### పద్యము

శైత్యనగ మహాధిపవంశ జయపతాక !
చంద్రశేఖర పూర్ణయుగః ప్రతీక !
సుస్మితానన ! పాలిత సురవితాన !
నీ సునాసికావేణు సునిశ్చితముగ
నిత్య కళ్యాణకరముగా నీ జనాల
యింట ముత్యాలపంట పండించుగాక !
నాసికా వేణునాళ మంతరమునందు
ప్రీతి ముక్తాఫలాలు ధరించియుంట
చంద్ర నిశ్వాస వాయు సంస్పర్శవలన
శుక్తిఫల సమృద్ధి ప్రధా స్రోత పొంగి
వామనాసికపై కాంతిధామమగుచు
మంచిముత్తెపు ముక్కెర మించులొలికె
వామదేవుని అర్ధాంగి ! వామనేత్ర !
శ్యామసుందరి ! ప్రేమ ప్రశాంతలహరి !
నీదు నాసికావంశమ్ము నిత్యముగను
మా యభీష్టముల్ సంపూర్తిసేయుగాక !

వ్యాఖ్య

అమ్మా ! హిమగిరినందనా !

నీ నాసికాసౌందర్యం వర్ణనీయం దానిలోని ఆంతర్యం స్తవనీయం అది మహనీయం నీ నాసాదండం పరమ వంశ దండంవలె భాసిస్తున్నది అది మా వంశాలకు అభివృద్ధిదాయకం అగుగాక ! వంశం అంటే వేణువు వెదురులో ముత్యాలు ఉంటాయి తల్లి నాసిక వేణువువలె ఉంది చంద్రనాడీమార్గం వామనాసిక చందమామ నిట్టూర్పులతో జాలువారి చంద్రమౌళీశ్వరుణ్ణి స్మరిస్తూ ఉన్నదామె ఈ జపస్మరణవలన చక్కని ముక్కున ముత్యాలు శోభిస్తున్నాయి మంచిముత్యాలకు పుట్టిల్లయిన ఆ ముక్కు చక్కదనం చెప్పలేము ఆ తల్లి ఆ నిట్టూర్పులవలన ముత్యం ఒకటి పైకివచ్చి ముక్కెర రూపంలో ముక్కుపైన అందాలు విరుస్తున్నది కడిగిపెట్టిన మంచు ముత్యంవంటి వంశపావనతను వెల్లడిస్తున్నది అది పులుకడిగిన ముక్కెరలోని ముత్యం అమ్మ ముత్యాల తల్లి !

★ ★

జయ శంకర ! శాశ్వత ! చంద్రశేఖరా !
భయనాశ ! గిరీశ్వర ! భక్తహరా !
నయనత్రయ ! భాస్కర ! నాగహరా !
యమమర్దన ! శాంత ! దయామయరా !

—కాశీఖండము

## 62. మధురాధరములు

ప్రకృత్యా రక్తాయా స్తవ సుదతి దంతచ్ఛదరుచేః
ప్రవక్ష్యే సాదృశ్యం జనయతు ఫలం విద్రుమలతా
న బింబం తద్బింబప్రతిఫలన రాగా దరుణితం
తులా మధ్యారోఢుం కథమివ న లజ్జేత కలయా

### పద్యము

త్రిపురసుందరి ! సౌందర్య దివ్యలహరి !
మూడుకన్నులవేలుపు ముద్దుగుమ్మ !
సుదతి ! అందాలుచిందు నీ పెదవిజంట
విద్రుమపు ఫలంబులంట వివేకమంట
రాగమాధుర్య నవ సుధారమ్య రస వి
లాసితముకాని విద్రుమలతలతోడ
భవ్య భవదీయ సహజ సౌభాగ్య రంజి
తోష్ఠముల పోల్చుటన్న నీచోపమమ్మ
అంబ ! నీ సొంపుటరుణాధరంబునుండి
ప్రతిఫలనమందుకతన బింబఫలమన్న
పేరు పొందినదమ్మ ఆపూరదొండ
నీదు పెదవికి అది సరిరాదు తల్లి
ఒక్క కలలోనకూడ - నిన్నోర్చిజూడ
జాలక ముఖమ్ము వంచుక నేల జూచు !

## వ్యాఖ్య

అమ్మా! నీ అధరాలు ఈశ్వరమనోహరాలు అవి అను రాగ శ్రీకరాలు నీవాతెరలు పగడపుతీగెలకంటె అరుణాలు అవి సాధా రణ ప్రవాళాలకంటె రాగరంజితాలు అరుణలతాజనితాలైన విద్రుమ ఫలాలు నీ మధురాధరాలు అనుపమానాలు పరిపక్వ బింబఫలంతో నీ అధరాన్ని పోల్చటం అవివేకం తల్లి! నీ అరుణాధరబింబ ప్రతి ఫలనంవల్లనే ఆ ఫలాలకు ఆ పేరు వచ్చింది ని కాంతిప్రసాదంవల్లనే అవి బింబఫలాలు అయినాయి అవి కేవలం నీ అధర ప్రతిఫలనాలు మాత్రమే స్ఫటికాలు జపాకుసుమ సాన్నిధ్యంచేత ఎర్రగా కని పిస్తాయి అంతేనిదా! వస్తుతః వాటికి ఆ గుణం లేదుకదా! ఇదీ అంతే నీ పెదవులలోని అనురాగంలోని పదియారవభాగం ఏమన్నా ఉంటే వాటికి ఉండవచ్చు అందుచే అవి నీ అధరాలను స్మరింపగానే సిగ్గుపడతాయి ఇది సహజమే కదా!

★ ★

వేయిముఖములుగల కాద్రవేయవిభుడు
నెఱయ శక్తుండుగాడట నిన్ను పొగడ
ఏకముఖమున పొగడంగ నెట్లు నేర్తు
నిన్ను శ్రీదక్షవాటికా నీలకంఠ!

—భీమేశ్వర పురాణం

## 63. సుస్మిత

స్మితజ్యోత్స్నాజాలం తవ వదనచంద్రస్య పిబతాం
చకోరాణామాసీ దతిరసతయా చంచుజడిమా
అతస్తే శీతాంశో రమృతలహరీ మామ్లరుచయః
పిబంతి స్వచ్ఛందం నిశి నిశిభృశం కాంజిక ధియా

పద్యము

కుటిల కుంతల మదుర చకోరనేత్ర !
చంద్రమౌళిప్రియా ! హిమాద్రీంద్రపుత్రి !
వెన్నెలపులుంగులు పడంగి వేడ్కతోడ
నీ స్మితానన చంద్రచంద్రికలు త్రావి
వెఱ్ఱితీపికి నాల్కలు వెగటుదోప
పుల్లతరవాణి యను భ్రాంతి తెల్లనైన
రేవెలుంగు వెన్నెల నీరు త్రావజొచ్చె
పెక్కురాత్రులు వెన్నెల పిట్టలెల్ల
చంద్రరేఖా విభూషణి ! సరసవాణి !

వ్యాఖ్య

అమ్మా! అమృతాంశుపదనా! అందాల చందమామా! నీ నెమ్మోము ముద్దులుగారుతున్నదమ్మా! అందాలు జాలువారుస్తున్నదమ్మా! అమృతం ఒలికిస్తున్నదమ్మా! నీ వదన పూర్ణచంద్రబింబం సుధామధువులు చిందిస్తున్నదమ్మా! మరో గమ్మత్తు ఏమంటే! వెన్నెల పులుగులు అన్నీ యిటేవచ్చి నీ మోము చందమామనుండి వచ్చే తియ్యందనాల నిండు పండువెన్నెల పానకాన్ని విరివిగా త్రావి త్రావి కైపెక్కిపోయాయి పాపం! వాటికి ఆ వెర్రి తీపివలన నాలుకలు చవి చచ్చిపోయాయి అప్పుడు నింగిలో చంద్రుడినుండి వచ్చే చంద్రికను చూచి పుల్లని తరవాణి అని రుచి చూచి కొంచం కొంచం రుచులూర గ్రోలుతున్నాయమ్మా!

 

మగువా! నీ పెంచిన లత
చిగురున ముకుళంబు లుల్లసిల్లునె చెపుమా!
పగడపు నెమ్మోవిపయిన్
నగ వుదయించిన విధంబునం బ్రస్ఫుటమై
—హరవిలాసం

## 64. రాగజిహ్వా

అవిశ్రాంతం పత్యుర్గుణగణకథా మ్రేడనజపా
జపాపుష్పచ్ఛాయా తవ జనని జిహ్వాజయతిసా
యదగ్రాసీనాయాః స్ఫటికదృషదచ్ఛచ్ఛవిమయీ
సరస్వత్యామూర్తిః పరిణమతి మాణిక్యవపుషా

### పద్యము

అరుణబింబాధర ! మృదుబిలాంబుజధర !
అవిరళము సేయు నీదు ప్రాణాధినాథు
త్రిపురవిజయాది గాన సత్కీర్తనమున
నిత్య చైతన్యశీలయౌ నీదు జిహ్వ
పాటలాధర ఒక జపాప్రసవమయ్యె
నిత్యమును నీదు జిహ్వపై నృత్యమాడు
స్ఫటికమణివంటి ధవళ నిసర్గ భర్గ
సర్వ శుక్లా సరస్వతీ స్వచ్ఛ తనువు
పద్మరాగ ప్రభాపూర్ణ వర్ణమందె
భక్తచింతామణీ ! మహేశ్వరుని రమణీ !

వ్యాఖ్య

అమ్మా! నీ ప్రియవల్లభుడు మహేశ్వరుడు ఆయన అన్నా, ఆయన గాథలన్నా నీకు వల్లమాలినంత అభిమానం ఇది సహజమే అనుకో నీవు ఉత్త అమాయరాలవు తల్లీ! నీవు నీ స్వామి విజయగాథలు త్రిపురాసురసంహారం, హాలాహల భక్షణం మొదలైనవి వర్ణించి వల్లించి కీర్తించటంచేత అదేపనిగా పాడటంవలన నీ సుతి మెత్తని నాలుక ఎంత ఎర్రబడిందో! దాసానిపువ్వువలె ఉందనుకో! నీ జిహ్వా అత్యరుణకాంతితో అనురాగ ప్రభాభాసురమై ప్రకాశిస్తున్న దమ్మా! మరో విశేషం వివరించనా - నీ జిహ్వాగ్రంపై శారదాదేవి నర్తిస్తోందికదా! శారద సర్వశుక్లాసరస్వతి కదా! స్ఫటికమణి మంజులమైన ఆమె దేహకాంతి వీడి ఆమెకూడ పద్మరాగచ్ఛాయలు విరజిమ్ముతూ అనురక్త అయినదమ్మా!

★ ★

కుర్వాణం సన్నిధౌ దేవ్యా దేవమానందతాండవం
హుతాశనధరం ధ్యాయేత్ తప్తకాంచన సన్నిభమ్ ।

## 65. ప్రసాదము

రణే జిత్వా దైత్యా నపహృతశిరస్త్రైః కవచిభిః
నివృత్తై శ్చణ్డాంశ త్రిపురహరనిర్మాల్యవిముఖైః
విశాఖేంద్రోపేంద్రైః శశివిశదకర్పూరశకలాః
విలీయంతే మాత స్తవ వదన తాంబూల కబళాః

### పద్యము

స్కందు డింద్రు డుపేంద్రుందు శత్రువుల బ
లమ్ము హరియించి యుద్ధస్థలమ్ము నుండి
కవచములు విప్పక తలపాగలను తీసి
చేతపట్టుక నీకుగాన్ జోతలిడగ
వచ్చియున్నారు సంభ్రమత అచ్చుపడగ
ఈ త్రయము పురహరుని దర్శించి తల్లి !
శంకరాశీస్సులంది హర్షమ్ము పొంది
చండప్రముఖుని దని మానసమున తలచి
హరుని నిర్మాల్యము కనుల నద్దుకొనియు
నందికిడి ప్రీతితో వచ్చినారు తల్లి!
షణ్ముఖుని నిల్పుకొని ముందుసాగివచ్చి
అతిపవిత్రమ్ము లతి మహిమాన్వితములు
చందురునివంటి మిగుల స్వచ్ఛమ్ములైన
గంధ తాంబూల కర్పూర ఖండ మిశ్రి
త భవదుచ్ఛిష్టములు ప్రసాదమ్ములంచు
స్వీకరించిరి తల్లి ! క్వాచిత్కములను

## వ్యాఖ్య

అమ్మా! భవానీ! ఈశాని! శర్వాణీ!

ఈ విచిత్రం విన్నావా! రణరంగంలో వీరవిహారం చేసి దైత్యసంహారం చేసి విజయశ్రీ పొందిన వీరులు ముందుగా మహాదేవ సందర్శనం చేసికోలేదు త్రిపురాంతకుడికి విజయగాథలు వినిపించలేదు శివ నిర్మాల్యం ముందుగా స్వీకరించలేదు దూరంగానే నమస్కారం చేసి పరుగుపరుగున నీ యొద్దకే వచ్చారమ్మా! అమ్మపై అనురాగం అట్టిది ఆ వీరులు సగౌరవంగా తలపాగలుమాత్రం తీసి చేతులతో పట్టుకొని ఇంకా యుద్ధకవచాదులు విడవకుండానే వచ్చారు అదిగో వారిముందు కుమారస్వామి - ఆయనను ముందు పెట్టుకొని మహేంద్ర ఉపేంద్రాదులు మునుముందుగా నీ దర్శనంకోసం వచ్చారు నీ మహాప్రసాదం అపేక్షిస్తున్నారు నీ ఉచ్ఛిష్ట కర్పూర కళికలు మహానందంగా ఇవి అపురూపం అని అనుగ్రహంగా భావించి ఆరగిస్తున్నారు తల్లీ! నీ కృపామృత ప్రేమ అట్టిది

★ ★

వర్తనంబెల్ల శంభుసేవావ్రతంబు
మాటలెల్ల పంచాక్షరీమంత్రరాజి
భోగమోక్షనివాసైక భూమియైన
దక్షపురినున్న జనులకో తలిరుబోణి

—భీమేశ్వర పురాణము

## 66. వా జ్మా ధు ర్య ము

విపంచ్యా గాయంతీ వివిధమపదానం పశుపతే
స్త్వయారబ్ధే వక్తుం చలితశిరసా సాధువచనే
త్వదీయై ర్మాధుర్యై రపలపిత తంత్రీకలరవాం
నిజాం వీణాం వాణీ నిచుళయతి చోళేన నిభృతమ్

ప ద్య ము

సరస సంగీతశాస్త్ర చర్చావినోది
నీ! సుధాగాన మందాకినీ! లలిత క
ళా విలాసిని! రసధుని! దేవగాయ
నీ మణి! శివా! కాత్యాయనీ! భవాని!
విశ్వకల్యాణి శ్రీవాణి వీణబూని
అతిముదాలసయై తన్మయత్వమొంది
పశుపతి పరాక్రమోపేత పటుకవిత్వ
మర్మ ధర్మాత్మకములైన మంజు మధుర
గేయములు కమ్మగా పలికించువేళ
చిత్త మానందవార్ధి వీచికలతూగి
'వహ్వారే'యను నీ గళోద్భవ రవమ్ము
వీణమధురిమ కెక్కుడై వెలయుచుండ
సిగ్గుపడి వాణి గౌసెనచీరతోడ
వీణియను వేగమే మూసివేసికొనెను
నవ్య నవనీత మధుర గాంధర్వలహరి!
శంకర మనోహరి! గిరీశ్వర కుమారి!

వ్యాఖ్య

అమ్మా! వీణాపాణి శ్రీవాణి నీ పతిదేవుని వీరవిహారగాథలైన త్రిపురాసురవిజయం, దక్షయాగధ్వంసం, హాలాహలభక్షణం, జలంధరవధ, గజాసురసంహారం వంటి అనేక ఘట్టాలను తన మధుర మంజుల మాణిక్యవీణపై వినోదంగా అతి మనోహరరాగాలలో పలికిస్తున్నదమ్మా! సరస సంగతులు ఒలికిస్తున్నదమ్మా! ఎటువంటి భావాన్నైనా ప్రభావయుతంగా విపంచీరావంపై ప్రతిస్పందింప జేస్తున్నది ఆ కచ్ఛప రమనీయస్వరం అపూర్వం

నీ సభాసదస్యులు మధుర వచస్సుల ద్వారా శిరఃకంపనాల ద్వారా కరతాళధ్వనుల ద్వారా తమ తమ అనుభూతులను ప్రశంసాత్మకంగా వెల్లడిస్తున్నారు ఇలా ఉండగా నీవు సంతోషాతిశయంతో ప్రశంసాపూర్వకంగానే ఒక కిలధ్వని చేశావమ్మా! అంతే ఆశ్చర్యపడింది అరవిందాసనుని రాణి వాణి వీణాతంత్రులు పలుకలేదు నీ మధురారవంముందు అవి చిన్నపుచ్చుకొన్నాయి వెంటనే శారద విపంచిపై కూర్పాసము తొడిగి మణిమందసంలో పెట్టింది నీ కలకంఠ కల నిక్వాణంముందు వాణీనిక్వాణం ఎంతమ్మా!

★ ★

సముధికంబైన సంసారజలధియందు
మునుగుచును తేలుచును కడముట్టుబడని
జనులకెల్లను మత్పాదసరసిజములు
తెప్పయై యుద్ధరించు నిందీవరాక్షి!

—భీమేశ్వర పురాణము

## 67. చుబుకము

కరాగ్రేణ స్పృష్టం తుహినగిరిణా వత్సలతయా
గిరీశే నోదస్తం ముహు రధరపానాకులతయా
కరగ్రాహ్యం శంభోర్ముఖముకురవృంతం గిరిసుతే
కథంకారం బ్రూమ స్తవ చుబుక మౌపమ్యరహితమ్

పద్యము

రత్నగర్భధరేశు గారాబుబిడ్డ!
చలువలూరెడు నిండుగుండెల వలిమల
తండ్రి ప్రేమతో దీర్ఘహస్తములనెత్తి
తనివితీరక ఒడికిముద్దాడు నీదు
చుబుక సౌభాగ్య భాగ్యమ్ము చెప్పతరమె!

అమృతకరధరుం డధిక మోహమ్ము పొంది
విద్రుమాధర! యని చేరి వేడ్కమీర
అధర మధుధారలందు ప్రయత్నమందు
ఎన్నిమారులో చేతితో ఎత్తబడిన
చుబుక సౌభాగ్య భాగ్యమ్ము చెప్పతరమె!

నీదు మధురాధరాబ్జకర్ణిక యటంచు
శంకరస్వామి కరసరోజమ్ములందు
అహరహము నూత్న మర్యాదలందుకొనెడి
తల్లి ! నీ ముఖదర్పణ దండమైన
చుబుక సౌభాగ్య భాగ్యమ్ము చెప్పతరమె !

వ్యాఖ్య

అమ్మా ! నీ చుబుకం కడు చక్కనిదమ్మా ! ఆ గండ సౌందర్యగరిమం వర్ణనాతీతం పరమపునీతం అతి మహిమాన్వితం నీ ఈ చుబుకాన్ని గిరిరాజు ఎన్నిసారులు ఎంత గారాబంగా మునివేళ్ళతో ముద్దుపెట్టుకొన్నాడో ! నీవు ఎన్ని గారాలుపోయావో ! ఎంత ప్రేమతో కైలాసవాసుడు విలాసంగా నీ ఈ చుబుకాన్ని ముద్దాడాడో ! నీ మోము చుంబించేవేళ శృంగారంగా ఎన్నిసారులు కర కమలాలలోకి ఈ చుబుకాన్ని తీసికొని స్పృశించాడో ! నీ మోము నిగ్గుటద్దమైనదని తన నీడ చూచుకొంటూ నీలకంఠుడు ఈ చుబుకం అద్దపు పిడివలె ఉన్నదని ఎంత సన్మానించాడో ! ఆ స్వామి చేతులలో ఎన్ని సోయగాలు విరజిమ్మిందోకదా ! నీ చుబుక సౌందర్యాతిశయం అనుపమానందదా ! సౌరభసౌభాగ్యాలలో దానికదే సాటి తల్లీ !

## 68. కంబుకంరము

భుజాశ్లేషా న్నిత్యం పురదమయితుః కంటకవతీ
తవ గ్రీవా ధత్తే ముఖకమలనాళ శ్రియ మియమ్
స్వత శ్శ్వేతా కాలాగరు బహుళ జంబాలమలినా
మృణాళీ లాలిత్యం వహతి యదధో హారలతికా

### పద్యము

కంబుకంధర ! కంబుభృత్కాంత ! పక్వ
విద్రుమాధర ! భూధర ప్రియకుమారి !
సహజసుందర ధవళిమ చౌకళించు
కంఠ తారహారమ్ము అగరు సుధూప
పంక సంపర్క మధుర శోభనమువలన
నుంత కనుమాసి నీలిమ కాంతినంది
మృదు మృణాళ భాగ్యమ్ము వహించినట్లు
పార్వతీ ! పద్మవదన ! నీ ప్రాణధవుని
భవుని దీర్ఘభుజాశ్లేష భాగ్య వశత
నిత్య రోమాంచమును పొంది నీ సురుచిర
కంఠనాళమ్ము ఆనన కనక కమల
దండ సౌభాగ్యమందె సౌందర్యలహరి !

## వ్యాఖ్య

అమ్మా! నీ కంఠ కమనీయత కడుంగడు శ్లాఘనీయం నీ కంఠం నీలకంఠుని కౌగిలింతలచే పులకాంకురమై రాణిస్తున్నది ముఖపద్మానికి కంఠం కమలనాళమై మురువులు విప్పుతున్నది శ్రీలు వెలయిస్తున్నది నీ ముక్తాహారం స్వచ్ఛగంధాగరు ధూపవాసనలచేత స్వచ్ఛమైన నీ గళసీమలో మంగళసీమయై మంజుళమృణాలమై ప్రకాశిస్తున్నది. ఇది సరేకానీ- నీ మెడలోని మంచిముత్యాలదండ సహజంగా ధవళమైనది అదికూడ శ్రీగంధ సంపర్కంచేత కస్తూరీ మృగమదంచేత కాబోలు నీలిమ వహించి తామరతూడువలె భాసిస్తున్నదమ్మా! ముత్యాలమాలతో నీ గళం సర్వమంగళంగా శోభిస్తున్నది

★ ★

ఎల్లజగంబులు నేలిన
హల్లకహితజూటు డల్లుడయ్యెనట! నా
యుల్లు వెలసె లోకంబుల
తల్లి! రుద్రాణి! యెట్టిధన్యుడనొక్కో!

—వరాహ పురాణం

## 69. కంఠరేఖలు

గళే రేఖాస్తిస్రో గతిగమకగీతైకనిపుణే
వివాహవ్యానద్ధప్రగుణగుణసంఖ్యాప్రతిభువః
విరాజంతే నానావిధమధురరాగాకరభువాం
త్రయాణాం గ్రామాణాం స్థితినియమసీమాన ఇవ తే

ప

నవ్య దివ్య మాధుర్య వీణాప్రవీణా!
అమలమతి! గతిగమక గీతైకనిపుణా!
సకల సంగీత సాహిత్య సారసుగుణా!
లలిత సుందర నాట్య కళాధురీణ!
నీదు కంబుకంఠము నందు నిగ్గులొలుకు
సుందర వళిత్రయమ్మును జూడ జూడ
అమృతశశిమౌళి నాడు కళ్యాణవేళ
కరయుగముచే నీ మెడ కట్టినట్టి
మహిత మంగళసూత్రమ్ము మరి సరత్ర
యమ్మునకు ప్రతినిధియునున్నట్టులుండె
మధురగాయని! మేనకాత్మజ! వసంత
దేవ గాంధారి దేశాక్షి దేశ గౌరి
మధ్యమావతి కళ్యాణి మాళవి యను
నాది వివిధరాగములకు ఆశ్రయమగు

లలిత సుస్వర సహజ గీతమ్ముపైన
షడ్జ మధ్యమ గాంధార సారభూత
మైన గ్రామత్రయమునకు మధ్య హద్దులుంచి
నట్లుగానుండె రేఖా త్రయమ్ము అమ్మ!

వ్యా॥ ౧౯

అమ్మా! నీవు మహాసంగీత కళామర్మజ్ఞురాలవమ్మా! సంగీతసాహిత్య కళానిధివి నీవు సర్వాణీ రమణీ! నీవు మార్గదేశి రీతులలో స్వరసంచాలనం జరిగించే నైపుణ్యంను చక్కగా కూర్చి మధుర గీతాగానం గావిస్తావు తల్లీ! నీ గాన నైపుణి నిరుపమానం. నీ నీల కంఠంపై వళిత్రయం రాగ సంపదని వెల్లడిస్తున్నది. త్రిరేఖలు మనోజ్ఞంగా భాసిస్తున్నాయి. ఆ రేఖలు నీ కల్యాణవేళ పరమశివుడు మంగళసూత్రాలు కట్టినప్పుడు చుట్టినప్పటి తంతువులా అనిపిస్తున్నాయి. ఆ త్రిసరాలు త్రయీ సంగీతత్రయానికి ప్రతీకలైనట్లున్నాయి. అనేక గ్రామరాగాలు, ఉపరాగాలు, జనక రాగాలు, జన్యరాగాలు, భాషా రాగాలు, విభాషారాగాలు అనే అన్ని రాగాలకు జనిస్థానాలు స్వర స్థానాలైనట్లు ఆ రేఖలు ప్రకాశిస్తున్నాయి. షడ్జగ్రామ మధ్యమగ్రామ గాంధారగ్రామాలు స్వర ఆరోహణ అవరోహణక్రమాలు వర్తించు మూర్ఛనలకు సరిహద్దులు ముద్దుముద్దుగా గీసినట్లున్నవమ్మా అవి

## 70. మృణాళ బాహువులు

మృణాళీమృద్వీనాం తవ భుజలతానాం చతసృణాం
చతుర్భి స్సౌందర్యం సరసిజభవ స్స్తౌతివదనైః
నఖేభ్యః సంత్రస్యన్ ప్రథమమథనా దంధకరిపోః
చతుర్ణాం శీర్షాణాం సమ మభయహస్తార్పణధియా

పద్యము

లలితలావణ్య కుసుమకోమల సుదేహ !
సద్య సుకుమార మృదుల మృణాళ బాహ !
ఆశ్రితాభయహస్త ! కావ్యప్రశస్త !
నిస్స్వార్థదానశీల ! సాహిత్యలోల !
తామరసనేత్ర ! పాపలతాలవిత్ర !
కల్పతరులతా సౌశీల్య గరిమమించు
పద్మలత సౌకుమార్యమ్ము పరిహసించు
ని చతుర్బాహువులు జూచి నీరజోద్భ
వుం డమిత హర్షసంభ్రమాత్ముండు నగుచు
తొల్లి తన యైదవ శిరమ్ము గిల్లి త్రుంచి
నట్టి రుద్రదేవుని గోళ్ళ నాత్మతలచి
భయముతో నిన్ను జేరి 'అభయమొసంగు
నాల్గుహస్తాలతోడ నా నాల్గుతలల
కాపాడుముగా" అనియంచు మ్రొక్కి నాల్గు
ముఖములన్ స్తుతించెను తల్లి! మూలశక్తి!

వ్యాఖ్య:

అమ్మా! అగిజా! చతుర్భుజా!

నీకుగల నాలుగు బాహువులు మృదుల మృణాలాలవలె అతిసుకుమారాలు అత్యంత సుందరాలు సౌభాగ్యకరాలు మనోహ రాలు నీవు చతుర్భుజవై సాక్షాత్కరింపగనే చతుర్ముఖుడికి పరమా నందం కలిగిందమ్మా! ఒకసారి మహేశ్వరుడు తామరచూలి ఐదవ శిరస్సు గిల్లివేశాడు మహేశ్వరస్మరణ రాగానే విధికి ఈ విషయం గుర్తుకు వస్తుంది సదాశివుని వ్రేలిగోళ్ళు చూడగనే మళ్ళీ ఎక్కడ ఏ శిరస్సు గిల్లివేస్తాడో అని భయపడిపోతుంటాడు ఎప్పుడైతే తామరచూలికి తన పుట్టింటిల్లాంటి తామరపూవులతో పోల్చదగు నీ అందాల బాహువులు కనిపించాయో అప్పుడే అమాంతంగా తన నాల్గు తలలు నీ నాలుగు చేతుల్లో పెట్టి ఒక్కసారిగా నా నాల్గుతలలకు అభయదానం అనుగ్రహించుమని కాళ్ళవ్రేళ్ళ పడుతున్నాడు తల్లీ! పాపం! బ్రహ్మదేవుడు నీవు సాటిలేని దయాంబురాశివికదమ్మా!

☆ ☆

అయిదు ముఖములు గలవాడ నౌదుగాని
నిగమశాస్త్రార్థములు గాన నేర్తుగాని
అధిక వైదగ్ధ్యవంతుండ నగుదుగాని
కడగి వర్ణింపనోప శ్రీకాశి మహిమ!

—కాశీఖండం

## 71. కరకమలములు

నఖానా ముద్యోతై ర్నవ నళినరాగం విహసతాం
కరాణాం తే కాంతిః కథయ కథయామః కథ ముమే
కయాచిద్వా సామ్యం భజతు కలయా హంత కమలం
యది క్రీడ ల్లక్ష్మీ చరణతల లాక్షారసచణమ్

పద్యము

ఉదయకిరణాలలోన అభ్యుదయమందు
సుందరారుణ వికచారవింద గరిమ
మా ఉషాకుమారి సుషమా మధుమనోజ్ఞ
కరతలారుణ శోభ కెక్కడ సమాన?
మంచుమించులు విరజిమ్ముకొందు ముందు
ముందుగ పొలుమికొనివచ్చి పొలుపుమీరి
నీ కరరుహాంచలైన నాజూకు గోళ్ళు
నవ్వుమున్నవి తల్లి! మందారపల్లి!
శ్రీ వధూమణి నాట్యమ్ము సేయువేళ
కాలి పారాణి ఒత్తుగ కాంతి వగిలి
అందగించినదో అరవింద మిప్పుడు
సుంత నీ పదునారవ వంతులోనొ
చిన్ని బంగారు నీ అరచేతితోడ
పోల్పగాతగు నెలతాల్పు పూవుబోణి!
శ్రీకరములై ప్రకాశించు నీ కరాలు
కవులు సుంతైన వర్ణింపగలరె తల్లి!

## వ్యాఖ్య

అమ్మా! నీ హస్తపద్మాల సౌందర్యం అనిర్వచనీయం. అత్యంతరమణీయం వాటికి పెట్టిన కిరీటాలవలె నఖాలు తేజఃపుంజాలను వెదజల్లుతున్నాయి అరచేతులు పద్మముందారాల అందాలను అపహాస్యం చేస్తున్నాయి ఆ సౌందర్యలహరిని కావ్యదక్షులుండంగా ఎంతని వర్ణించగలం తల్లీ! ఎల్లప్పుడు లక్ష్మీదేవి అరవిందంలో అధివసించటంచేత ఆ తల్లి కాలి లక్షారసం ఇసుమంత అంటి ఆ పూలకు ఆ శోభవచ్చి ఉండవచ్చు కానీ ఆ కమలాలు నీపాదాలకు సాటి రాజాలవమ్మా! నీ పదసంపదలో ఏమినారవకః ఏమైనా అందున్నదేమో! అట్టి అత్యల్ప సౌందర్యం గల అరవిందాలు నీ హస్తాల సౌందర్యానికి సాటిగా అతినిశ్చయంగా ఎలా చెప్పగలం తల్లీ!

★ ★

చల్లని వెండికొండపయి చంద్రశిలాసిత మంటపాల జా
బిల్లి వెలుంగులోన చనువిందొనరించు మనోజ్ఞ మాలతీ
మల్లెవనంబులో శివుడుమా రమణీమణి తిర్గుచున్ జగం
బెల్లసుఖంబులందు పరికింపరు నిత్యము తల్లి యింద్రులై!

—శాంతిశ్రీ

## 72. తల్లి పాలిండ్లు

సమం దేవి స్కంద ద్విపవదనపీతం స్తనయుగం
తవేదం నః ఖేదం హరతు సతతం ప్రస్నుతముఖమ్
యదాలోక్యాశంకాకులిత హృదయో హాసజనకః
స్వకుంభౌ హేరంబః పరిమృశతి హస్తేన ఝడితి

పద్యము

ఓ జగన్మాత! శ్రితదైవతోర్వీజాత!
ఒకట షణ్ముఖ కరిముఖ యుగముఁజేర్చి
చన్నుకుడిపెడు మాతృవాత్సల్యమెంచి
అభినుతించెద నిన్ను దయామృతాబ్ధి!
ఆకలినితీర్చి కలిబాధ హతమొనర్చి
కల్మషమునెల్ల పాలతో కడిగివైచి
ఇంపుగొల్పెడు నిండు పాలిండ్లు తల్లి!
మా కమృతసిద్ధి కలిగించుగాక! సతము
నీదు పాలిండ్లు గాంచి దంతిముఖు డహహా!
"నాదు కుంభద్వయంబేమొ" నాన్ శిరమ్ము
తడుముకొనెడి అమాయకత్వంబు జూడ
నవ్వువచ్చును తల్లి! ఆనందవల్లి!

వ్యాఖ్య

అమ్మా! పార్వతీదేవి! మీ అబ్బాయీలు షడాననుడూ, గజాననుడూ ఇరువురు నీ పాలిండ్లుపట్టి కడుపార తనివితీర పాలు త్రాగుతున్నారమ్మా! త్రాగుతూ త్రాగుతూ ఆపి తలెత్తి నీ చను మొనలనుండి పాలు కారుతుంటే ఆశ్చర్యంగా, ఆనందంగా చూస్తున్నారు తల్లీ! ఇంతలో గణపతికి ఒక సందేహం వచ్చింది గజరాజ కుంభాలు నా తలపైవికదా! ఇపుడు అమ్మ రొమ్ములపైకి ఎలా వచ్చాయి నావి నా తలపై ఉన్నాయా లేవా! అని ఏమనుకొన్నాడో తన తొండంతో తన తల తడుముకొంటున్నాడు తల్లీ! అది చూచి కుమారస్వామి అన్నయ్య అమాయకత్వానికి నవ్వుకొంటున్నాడు విషయం తెలిసికొని నీవూ నవ్వుకున్నావుకదూ! ఇలా నవ్వు పుట్టించిన నీ పాలిండ్లు మా సర్వసుఖాలకు పుట్టిండ్లు మెట్టిండ్లు కావాలని కోరుకొంటున్నాము తల్లీ!

★ ★

విశాల నీలోత్పల లోచనాయై
వికాసి పంకేరుహ లోచనాయ
సమేక్షణాయై విషమేక్షణాయ
నమః శివాయైచ నమః శివాయ

—అర్థనారీశ్వరాష్టకం

## 73. జ్ఞాన క్షీరము

అమూ తే వక్షోజా వమృతరస మాణిక్యకుతుపౌ
న సందేహస్పందో నగపతిపతాకే మనసి నః
పిబంతౌ తౌ యస్మా దవిదిత వధూ సంగరసికౌ
కుమారా వద్యాపి ద్విరద వదనక్రౌంచదళనౌ

పద్యము

నగపతిపతాక! సత్కరుణాప్రతీక!
ఓ జగన్మాత! నీ సువక్షోజయుగము
రత్న మాణిక్య వైఢూర్య రచితమైన
అమృత రసపూర్ణ కుతపద్వయమ్మె! అవును
తల్లి! నీ చన్నుబాలను త్రాగినట్టి
కరిముఖ కుమార యుగ - మీ యుగమ్ము వరకు
ఏ వధూ సంగమము నింత ఎరుగనట్టి
బాలురై బ్రహ్మచారులై వరలిరమ్మ!
నిర్మల జ్ఞానరసవాహినీ! భవాని!
అమృత రసదాయినీ! జననీ! నమోస్తు!

## వ్యాఖ్య

అమ్మా! నీ వక్షోజాలు పరమ జ్ఞానామృతం నింపుకొన్న బంగారుకుండలు స్నేహామృతభాండాలు జ్ఞానజ్యోతిని వెలిగించే తైలఘటాలు అవి మణిమాణిక్య రత్నఖచిత సుధాభాండాలవలె ప్రకాశిస్తున్నాయి తల్లీ! ఇందులో ఇసుమంతకూడా సందేహం లేదు నీ చనుబ్రాలు గ్రోలి వినాయకస్వామి, కుమారస్వామి మహా విజ్ఞాన మూర్తులై వెలుగొందుతున్నారు నీ స్తనపానంవల్లనే వారు నేటికీ కామినీసంగరహితులై దేవసమాజానికి అగ్రగణ్యులై పూజలందు కొంటున్నారు తల్లీ! నీ క్షీరబలం అట్టిది తల్లివంటే నీవేనమ్మా తల్లివి!

 

మమ్ము రక్షించితనియేల మాటిమాటి  
కభినుతింపంగ దక్షవాటాధినాధ!  
తల్లిదండ్రులు రక్షింప దలపకుండ్రె  
ప్రజల భీమేశ! బహువిధోపద్రవముల

—భీమేశ్వర పురాణం

## 74. ముత్యాల సరాలు

వహ త్యంబ స్తంబేరమదనుజ కుంభ ప్రకృతిభిః
సమారబ్ధాం ముక్తామణిభిరమలాం హారలతికాం
కుచాభోగో బింబాధరరుచిభి రంత శ్శబలితాం
ప్రతాపవ్యామిశ్రాం పురదమయితుః కీర్తి మివ తే

### పద్యము

అంబ! గుణనికురంబ! హేరంబ జనని!
మదగజాసుర కరిన కుంభజములై - ర
వంత దోషమ్ము లేని ముత్యాలసరులు
నీదు బింబాధర ప్రభానీకమంటి
కెంపి దరుణమ్ములై అందగించి మించి
చిత్రవర్ణ మయూఖాలు జిమ్మసాగి
పురహర ప్రతాప యశమ్ము కరణి మెరసి
నీ కుచాభోగమున రవణించుచుండె
రత్నమణిభూషణీ! నటరాజ రమణి!

## వ్యా ఖ్య

అమ్మా! నీ మెడలోని మంచిముత్యాలపేరులు చాలా అందంగా ఉన్నాయమ్మా! నీ వక్షోజాల మధ్యగల విశాలప్రదేశంలో ఈ ముక్తాతారహారాలు అత్యంత శుభంకరాలు మహాదేవుడికి మరీ మనోహరాలు మహాదేవుడు మదమత్త గజాసురుణ్ణి సంహారంచేసి ఆ గజచర్మం తాను ధరించి ఆ గజకుంభంలోని ఆణిముత్యాలు తెచ్చి నీకు హారాలుగా అలంకరించాడమ్మా! నీ కుచకుంభాలకివి శోభను చేకూరుస్తాయని మనస్సులో భావించి మక్కువతో సమకూర్చాడమ్మా ఇవి త్రాసరహితమైన ఈ ముక్తామాలలు శుద్ధస్వచ్ఛ ధవళకాంతి విలసితాలు ఇవి నీ విద్రుమాధరద్యుతులచే ప్రతిఫలించి అరుణారుణాలై అనురాగరంజితాలైనాయి అంతేకాదు శివప్రతాపంతో మిశ్రితమైన నీ కీర్తి లలితలతికలవలె నీ విశాల కుచకుంభాలపై వెలుగొందుతున్నాయి తల్లీ!

★ ★

సమశ్శివాభ్యాం పరమౌషధాభ్యాం
పంచాక్షరీపంజర రంజితాభ్యాం
ప్రపంచ సృష్టిస్థితి సంహృతాభ్యాం
నమోనమశ్శంకర పార్వతీభ్యాం

—ఉమామహేశ్వర స్తోత్రం

## 75. సాహితీ స్తన్యము

తవ స్తన్యం మన్యే ధరణిధరకన్యే హృదయతః
పయఃపారావారః పరివహతి సారస్వత మివ
దయావత్యా దత్తం ద్రవిడశిశు రాస్వాద్య తవ యత్
కవినాం ప్రౌఢానా మజని కమనీయః కవయితా

పద్యము

సకల సురమాన్య ! అద్రిరాజన్య కన్య !
నీ హృదయదుగ్ధవారాశి నిగ్గుదేరి
పొంగివచ్చెడి స్తన్యమ్ము - పూర్ణ సాహి
తీ సుధా ధారగా ప్రస్తుతింతుమమ్మ
నిండు వాత్సల్యమూర్తివై నీవు అపుడు
కుడిపినటువంటి చనుపాలు కొన్ని త్రాగి
ద్రవిడ బాలుండు నుద్దండ కవులలోన
ఇంత శాంతమ్ముగల సుకవీంద్రుడయ్యె !

వ్యాఖ్య

అమ్మా! నీ హృదయం పాలసముద్రం అందుండి ఉబికి వచ్చే నీ వక్షోజ క్షీరధారలు పాలుమాత్రమే కావమ్మా! సారస్వత సుధాధారలు మధురాతి మధురాలు అవి జ్ఞానక్షీరపారావారాలు అట్టి నీ చనుబాలు ఈ ద్రావిడ శిసువుకి కడుపార పట్టించావమ్మా! దయా మృతరాశీ! అందువల్లనే విడు మహా ప్రౌఢ కవీంద్రులలో అగ్రేసరు డైనాడు జ్ఞానులలో ఆచార్యపీఠం అధిష్ఠించగలిగాడు భక్తవర్యులలో స్వచ్ఛమైన మహాభక్తుడు అయినాడు అంతా నీ దయ తల్లీ!

★ ★

మనోబుద్ధ్యహంకార చిత్తాని నాహం
న శ్రోత్రం న జిహ్వే న చ ఘ్రాణనేత్రే
న చ వ్యోమ భూమి ర్న తేజో న వాయు
శ్చిదానంద రూప శ్శివోఽహం శివోఽహం!

—నిర్వాణషట్కం

## 76. సౌందర్య రేఖ

హరక్రోధజ్వాలావళిభి రవలీఢేన వపుషా
గభీరే తే నాభిసరసి కృతసంగో మనసిజః
సముత్తస్థౌ తస్మా దచలతనయే ధూమలతికా
జన స్తాం జానీతే జనని రోమావళి రితి

### పద్యము

కొండరాయుని గారాల కూర్మితనయ!
తపము గావించునపుడు కందర్పుడేగి
విఘ్నమొనరించినంత శత్రుఘ్నుడైన
రుద్రు డుగ్రుడై విలయంపు క్రోధ మూని
ఫాలనేత్రాగ్ని శిఖల కాల్పంగసాగె
అపుడు మారుండు పరువెత్తి అతివ! నీదు
నాభిసరసిలోపల దూకి స్నానమాడ
మంటలారుచు వచ్చు ధూమంపు లతిక
ప్రాకగా జూచి మనసులో ప్రౌఢలంత
యవ్వనంబున పొడసూపునట్టి నీదు
ముద్దునూగారు అని తలపోసినారు!

వ్యాఖ్య

అమ్మా! ఒకసారి మహాదేవుడు తపస్సులో ఉండగా మారుడు మహేశ్వరుడిపై మదన బాణాలు ప్రయోగించసాగాడు. ఫాలాక్షుడికి కోపం వచ్చింది మూడవకన్ను తెరచి అగ్నిజ్వాలలు రేపి మన్మథుణ్ణి మసి చేయసాగాడు మరుడు ఆ మంటల్లో మండిపోతున్నాడు ఆ మండుతున్న శరీరంతో పరుగుపరుగున వచ్చి నీ నాభి సరోవరంలో దూకాడు. ఆ మంటలారినాయి ఆ నిప్పు చల్లారటంచేత నల్లనిపొగ పైకిలేచి ప్రాకసాగింది నిప్పులు నీళ్ళలో పడితే పొగ వస్తుందికదా! అలానే మండుతున్న మరుడు నీటపడ్డప్పుడు పొగచారికలు కట్టింది ఆ ధూమమార్గాన్ని అమాయికలైన అరవిందనయనలు నీ నూగారు అని అంటున్నారు అమ్మా!

★ ★

ధవళలోచన! శ్రీపర్వతంబు మహిమ
ప్రస్తుతింపంగ శక్యమే బ్రహ్మకైన
గండశిలలెల్ల శంభులింగంబు లిందు
సిద్ధమును లిందు చరియించు చెంచులెల్ల!

—కాశీఖండము

## 77. రోమరాజి

యదేతత్కాళిందీ తనుతరంగాకృతి శివే
కృశే మధ్యే కించి జ్జనని తవ యద్భాతి సుధియామ్
విమర్దా దన్యోన్యం కుచకలశయో రంతరగతం
తనూభూతం వ్యోమ ప్రవిశదివ నాభిం కుహరిణీమ్

పద్యము

బాల ! గుణజాల ! పుష్పకుందాలమాల !
తామరసనేత్ర ! త్రినయున ధ్యానమగ్న
శిశిర కాళింది మధ్యలో చిన్నితరగ
రూపు దాల్చినయట్లున్న రోమరాజి
నీదు ఉదరమ్ముపై రవణించుచుండ
ప్రౌఢకాంతలు నవ్వుచు పలికిరిట్లు-
"ఒత్తుకొనివచ్చు కుచకుంభ యుగముమధ్య
సూక్ష్మముగనున్న నీలాల హొన్యదివము
నిలువజాలక వేగ క్రిందికిని జారి
నాభి కుహరాన పడుచునున్నది అయారె !'

వ్యా ఖ్య

అమ్మా ! నీ లేకౌను పైభాగాన సన్నని రోమాళి రమణీయంగా ఉంది అది యమునా తోయతరంగంవలె సోయగంగా వుంది. ఆ సుకుమార తరంగం ఆకాశంవంటి విశాలహృదయస్థానానికి ప్రాకసాగింది ఇంతలో అక్కడ మధ్యేమార్గంలో కుచపర్వతాలు పెరిగి విస్తరించి తరంగమార్గాన్ని అడ్డుకొన్నాయి ఆ కొండల మధ్య ఈ తరంగం మరీ సన్నబడి పైకిపోలేక నాభీసరస్సులో ప్రవేశిస్తున్నట్లుగా భాసిస్తున్నది తల్లి ! కల్పవల్లీమతల్లీ !

★ ★

నమశ్శివాభ్యాం కలినాశనాభ్యాం
కంకాళ కళ్యాణ వపుర్ధరాభ్యాం
కైలాసశైల స్థితదేవతాభ్యాం
నమోనమ శ్శంకర పార్వతీభ్యాం

—ఉమామహేశ్వర స్తోత్రం

# 78. న త నా భి

స్థిరో గంగావర్తః స్తనముకుళ రోమావళిలతా
కలావాలం కుండం కుసుమశరతేజో హుతభుజః
రతేర్లీలాగారం కిమపి తవ నాభి ర్గిరిసుతే
బిలద్వారం సిద్ధే ర్గిరిశ నయనానాం విజయతే

ప ద్య ము

హిమగిరి కుమారి ! సుకుమారి ! హిమమయూఖ
ధారి నారీలలామ ! సౌందర్యధామ !
అందములు విందు సేదు లోతైన నాభి
అమర గంగానదీ ప్రవాహమ్ము మధ్య
సుస్థిరమ్ముగ వలగొను సుడిగదమ్మ
పొద్దు చనుమొగ్గలను పూచి మురియుచున్న
నీలి నూగారు లత కాలవాలమమ్మ
అలరువిల్కాని విరహాగ్ని అనవరతము
మండుచుండెడు మరుహోమ గుండమమ్మ
ప్రౌఢవములొల్కు మన్మథ రమణి రతికి
పరమసుందర శృంగార భవనమమ్మ
నీ ప్రియతముండు శంభుని నేత్ర తామ
రస తపస్సిద్ధి గుహకు ద్వారమ్ము తల్లి
అది అవర్ణనీయోత్కర్షమైనదమ్మ !
తల్లి ! శ్రితకల్పవల్లి ! సౌందర్యలహరి !

వ్యాఖ్య

అమ్మా! నగరాజకుమారీ! నీ నతనాభీ ప్రదేశం కైలాస నగరాధిపతియైన నటరాజుకు నయనాభిరామంగా ఉందమ్మా! నీ నాభి పరమ పవిత్ర త్రిపథగా గంగానదీఆవర్తంవలె శోభిస్తున్నది నీ చనులు తామరమొగ్గలవలెను - నీ నూగారు ఆ తామరమొగ్గల నంటివచ్చు తామరతూడువలెను - ఆ తామరతూడుకు నీ నతనాభి ఒక పాదువలె ప్రకాశిస్తున్నది అంతేకాదు నీ పొక్కిలి మన్మథాగ్నికి హోమగుండం వలె భాసిస్తున్నది ఇంకా అది మదనమహిషి రతీదేవికి శృంగార గృహంవలె శోభిస్తున్నది ఆ పరమ శివమూర్తికి పరమానందకార ణమై ఆయన నయనాలకు తపఃఫలమైన గుహాద్వారమై అనిర్వాచ్య సౌందర్యంతో ప్రకాశిస్తున్నది తల్లీ!

★ ★

ఎన్నికల్పంబు లరిగిన నెడలిపోవ
డెంపరింద్రులు గడచిన నెలమిదప్ప
దెన్ని మన్వంతరంబులు చన్ననెపుడు
పసిమిదప్పదు కాశికాపట్టణంబు!

—కాశీఖండం

## 79. సూక్ష్మ మధ్య

నిసర్గక్షీణస్య స్తనతటభరేణ క్లమజుషో
నమన్మూర్తే ర్నారీతిలక శనకై స్త్రుట్యత ఇవ
చిరం తే మధ్యస్య త్రుటితతటినీతీరతరుణా
సమావస్థా స్థేమ్నో భవతు కుశలం శైలతనయే

పద్యము

అన్నువలమిన్న! సన్నని చిన్నినడుము
కుంభి కుంభద్వయమువంటి కుచభరమ్ము
మోయజాలక ఎటువంగిపోయి తెగునో
అనెడి పగిదిగా జవజవలాడుచుండె
సూక్ష్మతరమధ్య! కోమల సుమలతాంగి!
తెగినగట్టుపైగలచెట్టు స్థితినిపోలి
పండ్లబరువుతో కొద్దిగా వంగి ఊగు
నీదు లేనౌను చిరము రాణించునమ్మ!

వ్యాఖ్య

అమ్మా! నీ లేతనడుము మిక్కిలి సన్ననిదై ఎక్కువ చక్కగా రాణిస్తున్నది అది అస్తినాస్తి విచికిత్సకు గురి అవుతున్నది తల్లీ! నడుం చూస్తే సన్నని పూలతీవవలె ఉంది స్తనాలు పెద్ద పెద్ద అమృతఫలాలవలె ఉన్నాయి ఇంకా ఆపుచయుగం అమృతభాండాల వలె బంగారుకుండలవలె నానాటికి విజృంభిస్తున్నాయి ఈ స్తన భారానికి ఆ సన్నని నడుం ఎక్కడ వంగి పుటుక్కుమంటుందో అని భయం తల్లీ! అట్లు జరుగకుండుగాక! ఏటిగట్టు పూర్తిగా కోసుకు పోగా చివర గట్టుపైగల తియ్యమామిడిచెట్టు స్థితివలె ఉంది తన్వీ నీ నడుం స్థితి అయినా నీ నడుం సుస్థిరతపొంది చాలాకాలం ఇట్లే క్షేమంగా ఉండుగాక!

★ ★

చాంపేయ గౌరార్థ శరీరకాయై
కర్పూర గౌరార్థ శరీరకాయ
ధమ్మిల్లకాయైచ జటాధరాయ
నమః శివాయైచ నమః శివాయ!

—అర్థనారీశ్వరాష్టకం

## 80. త్రివళి

కుచౌ సద్య స్స్విద్య త్తటఘటితకూర్పాసభిదురౌ
కషంతౌ దోర్మూలే కనకకలశాభౌ కలయతా
తవ త్రాతుం భంగా దలమితి వలగ్నం తనుభువా
త్రిధా నద్ధం దేవి త్రివళి లవలివల్లిభిరివ

### పద్యము

కనక కమనీయ మంగళ కాంతిదీప !
శివుని రవ్వంత తలపుతో చెమ్మగిల్లి
పట్టు జలతారు రవికయు పట్టనట్లు
బాహుమూలమ్ములొరసి పైపైకివచ్చు
చక్కదనముల నిక్కని చన్నుఁగవకు
నిండు బంగారుకుండల నిగ్గునీటు
నిక్కు నిక్కమ్ముగా కూర్చి - బిక్కుబిక్కు
మంచు ఎక్కడో ఉండి లేనట్టులున్న
లేతగౌనుకు బలముకల్పింపనెంచి
మూడు వరుసల ఏలకి పూలతీగె
తీయవిల్కాడు చుట్టినాడోయనంగ
నీదు నడుముపై త్రివళి కన్పించునమ్మ !

వ్యాఖ్య

అమ్మా! మహాదేవదేవీ! నీ నడుముపైగల మూడు రేఖలు చూడగా మన్మథస్వామి నీ లేగౌను సంరక్షణార్థం ఏలకీ తీవెలు మూడుపేటలుగా బిగించి కట్టాడా అన్పిస్తుంది తల్లి! మన్మథుడికి నీ దేహసంరక్షణలో ఎంత అభిమానమో! నీ నడుం పిడికిట ఇమిడే టంత చిన్నదాయె ఆ లేగౌను తీసికు స్తనాలరూపంలో బంగారుకుండ లంత అమృతఫలాలాయె అవి బాహుమూలలకు వ్యాపించి మరీ పెరిగి ఉండె అవి పరమేశ్వర మధుర శృంగారభావనతో చెమర్చి తొడు క్కున్న పట్టురవికను పిగిలేలా చేస్తున్నాయి అందుకనే పరోపకారు డైన మారుడు మంచిగుణంతో ఇలా చేసి ఉంటాడని అనిపిస్తున్నది తల్లి! అందాల జాబిల్లీ!

★ ★

ప్రణవంబు నీవు నిర్మల గుణాలంకార!
ఆమ్నాయ విద్య యీ అలరుబోడి
తప మీవు శశిశేఖరోత్తంస భక్తినిధాన!
శాంతి యీ సంపూర్ణ చంద్రవదన

—కాశీఖండము

## 81. ని తం బ ము

గురుత్వం విస్తారం క్షితిధరపతిః పార్వతి నిజాత్
నితంబా దాచ్ఛిద్య త్వయి హరణ రూపేణ నిదధే
అతస్తే విస్తీర్ణో గురురయ మశేషాం వసుమతీం
నితంబ ప్రాగ్భారః స్థగయతి లఘుత్వం నయతిచ

వ్యాఖ్య

పార్వతీదేవి! ఒకమాట పలుకజాతు
ఘనధరాధర ప్రభువు నీ కన్నతండ్రి
బరువు నిడివియుగల నితంబ ప్రదేశ
మొండు శ్రేష్ఠమైనది తన కొండలందు
ఏరి పెండ్లిలో అరణమ్ము నిచ్చె నీకు
కారణంబది చాబోలు కలువకంటి!
నీ నితంబమ్ము - భారమ్ములోన నిడివి
లోన - గొప్పపేరంది వెలుంగుచున్న
వసుమతిని గప్పి తేలిక పరచెనమ్మ!
ఇందుధరు రాణి! ఇందులో సందియంబ!

వ్యా ఖ్య

అమ్మా ! హిమగిరితనయా ! నీ నితంబ ప్రదేశం సువిశాలం. నీ తండ్రి పర్వతేశ్వరుడు తన పర్వత సాను ప్రదేశాలలో శ్రేష్ఠమైనదీ గొప్పదీ ఎన్నికచేసి నీకు అరణంగా ఆభరణంగా ఇచ్చాడుకదా! అదే స్ఫురింపజేస్తున్నది నీ నితంబప్రదేశం నీ నితంబం ఈ వసుంధరనే కప్పివేసేటంతగా వ్యాపించి సౌందర్యంగా సౌభాగ్యవంతంగా ఉంది అది ఆచ్ఛాదనలో గౌరవంలో వసుమతి తలదన్నుతున్నట్లుంది ఇందు నీ పుట్టింటి గుణగౌరవాలు ద్యోతమానం అవుతున్నాయి ! అమ్మా !

★ ★

తరుణియందందు కేసరదామ కాంచి
జఘన పులినంబు నందుండి జాఱిపడగ
మాటిమాటికి హస్తపద్మముల నెత్తు
చచల భావంబుతోనుండె నభవు మోల !

—హరవిలాసము

## 82. రంభోరు

కరీంద్రాణాం శుండాన్ కనక కదళీ కాండపటలీం
ఉభాభ్యాం మూరుభ్యా ముభయమపి నిర్జిత్య భవతీ
సువృత్తాభ్యాం పత్యుః ప్రణతి కఠినాభ్యాం గిరిసుతే
విధిజ్ఞే జానుభ్యాం విబుధకరికుంభద్వయమసి

పద్యము

వేదవిదిత పతివ్రతా! విశ్వవినుత!
భద్ర వేదండ శుండాల భాగ్యగరిమ,
కనక కదళికా గోత్ర ప్రకాండసుషమ,
సుందరోరుద్వయమ్ముచే క్రిందుచేసి
'జయ' బిరుద మందితివి గిరిజాకుమారి
పతికొనర్చెడి కఠినంపు ప్రణుతివలన
నున్నపై గుండ్రమైనట్టి జానువులచేత
ఇంద్రు కరికుంభయుగము నోడించితమ్మ
సర్వమంగళా! సర్వజ్ఞ సారసాక్షి!

వ్యాఖ్య

అమ్మా! గిరిరాజకుమారీ! నీ ఊరువులు అరటిస్తంభాలనూ, కుంభిశుండాలనూ జయిస్తున్నాయి ఇవి వంశవర్ధన సూచకాలు. నిండు సౌభాగ్యవర్ధకాలు నీవు పరమపతివ్రతా శిరోమణివి వేదవిధిజ్ఞురాలవు కనుక నిత్యం నీవు సిలపంరేశ్వరుడికి పాదాభివందనం చేస్తుంటావు అలా చేయటంవలన ఆ నమస్కారవ్యాయామం వలన నీ అంగాలు భూమికి స్పృశించి ముఖ్యంగా నీ జానువులు గట్టిపడ్డాయి అలా గట్టిపడి గజకుంభాలను ధిక్కరిస్తున్నాయి ఇలా నీవు ఊరువుల చేత వేదండశుండాలనూ రంభాస్తంభాలనూ జయించటమేకాక జానువులచేత దిక్కుంభి కుంభాలనుకూడా జయించి విజయశ్రీవై విశ్వేశ్వరుడికి పట్టపురాణివైనావమ్మా!

★ ★

ఓం దేవాదిదేవ దేవేశ
సర్వప్రాణ భృతాం వర
ప్రాణినామపి నాథ స్త్వం
మృత్యుంజయ నమోస్తుతే!

—మృత్యుంజయ స్తోత్రం

## 83. అమ్మలపాది

పరాజేతుం రుద్రం ద్విగుణశరగర్భౌ గిరిసుతే
నిషంగౌ జంఘే తే విషమవిశిఖో బాఢమకృత
యదగ్రే దృశ్యంతే దశ శరఫలాః పాదయుగళీ
నఖాగ్ర చ్ఛద్మాన స్సురమకుటశాణైకనిశితాః

### పద్యము

దివ్యసుందరీ! హైమవతీ కుమారి!
మూడుకన్నులవేల్పుతో మోహరింప
కుసుమబాణుండు అస్త్రములఁ గూర్చుకొనుచు
పంచశరములు ద్విగుణీకరించి శర ని
షంగములఁజేసె - నిజము నీ జంఘయుగము
ఇంద్రచంద్రాది సురకిరీటేంద్ర నీల
శాణములపైన నిష్ఠతో సానబెట్టు
బడినవో యనంగా నగప్రభునిపుత్రి!
నీపద నఖాగ్రములు సోగి నిక్కుటక్కు
ములికలై విమ్మినవి తళత్తళలు పెక్కు!

వ్యాఖ్య

అమ్మా! నీ జంఘలు వీరమన్మథ విజయంకరాలు మన్మథుడు వీనిని తన అంబుల పొదులుగా నిర్మించుకొన్నాడమ్మా! ఎందుకంటే! రుద్రుణ్ణి ఎదుర్కొనటానికి అన పంచబాణాలు చాలవని కాబోలు ఐదు పదిచేసి నీ జంఘలనే అంబుల పొదులలో భద్రపరచుకొన్నాడు నిజమమ్మా! అవిగో అడుగులయందు గల ఐదు ఐదు పది వ్రేళ్లు ముందుకు వచ్చాయి వాటి కొనలగోళ్లు చూడు ఆవి వ్రేళ్ళ గోళ్లు కావు మన్మథశరాలు అవి ఆ శరాలకు చివరగల ఉక్కుములికలు ఆ ఉక్కు ములికలనుపట్టి నీకు నమస్కరించటానికి వచ్చే దేవేంద్రాదుల కిరీటాల మణులపై మరుడు ఎవరికీ తెలియకుండా పదును పెడుతున్నాడు మణులు సానరాళ్ళవలె ఉన్నాయి అలా తన బాణాగ్రాలను తయారుచేసికొన్నాడు మరుడు కనుక నీ జంఘలు మన్మథ జయసాధనాలు తల్లీ!

★ ★

హృత్పుండరీకాంతర సన్నివిష్టం
స్వతేజసా వ్యాప్త నభోవకాశం
అతీంద్రియం సూక్ష్మమనంతమాద్యం
ధ్యాయేత్పరానందమయం మహేశమ్!

—శివ కవచమ్

## 84. శ్రీ పాదములు

శ్రుతీనాం మూర్ధానో దధతి తవ యౌ శేఖరతయా
మమాప్యేతౌ మాత శ్శిరసి దయయా ధేహి చరణౌ
యయోః పాద్యం పాథః పశుపతి జటాజూటతటినీ
యయో ర్లాక్షాలక్ష్మీ రరుణహరిచూడామణిరుచిః

పద్యము

తల్లి ! నీపాద పారిజాతద్వయమ్ము
వేదమాతలు సారంగవేణిపైన
భక్తితో యుక్తితో ననురక్తితోడ
తీర్చిదిద్దుకొందురు మహాదేవదేవి !
శ్రీమహావిష్ణు నీ పాదసేవచేసి
ఉభయసంధ్యల ప్రణమిల్లుచున్నయపుడు
చరణ లాక్షారసమ్ము ప్రసాదమంచు
హరి శిరోమణి అరుణిమ మందుకొనును
శివ జటాజూటవీథుల చిందులాడు
పరమపావని గంగ నీ పాద్యమయ్యె
ఎప్పుడందువా ! నే వివరింపనేల
ప్రణయకలహాన భవుడు నీ పాదములకు
శిరము మోడ్చిన వేళనే శివునిరాణి
శ్రీపదాంబుజయుగము నా శిరముపైన
ఉంచవే తల్లి ! కారుణ్యముంచి సుంత
పాపనాశని పావని ! పరుసవేది !

వ్యాఖ్య

అమ్మా! మాతా! పరమపునీతా! నీ పాదపద్మాలను ఉప నిషత్కాంతామణులు తమతమ సీమంత సిందూర సౌభాగ్యం చెంత శిరోభూషణాలుగా పరమపూజ్యభావంతో అలంకరించుకొంటున్నా రమ్మా! మహేశ్వరుడు పేరలుకతీర్చే నెపంతో నీ చరణ రాజీవాలను తన జటాజూటానికి స్పృశించుకొంటాడు అప్పుడే శివ జటాజూటంలోని కలుషహారిణి గంగామతల్లి నీకు పాద్యమై కాళ్లు కడిగి చరితార్థత పొందుతుంది శ్రీ మహావిష్ణుమూర్తి ప్రతినిత్యం నీ పాదారవిందాలకు ప్రణమిల్లి లాక్షారసకాంతిని తన శిరోరత్నమైన కౌస్తుభానికి ఆపాదించు కొంటాడు అట్టి పరమపునీతమైన నీ చరణాంబుజాలను నా శిరస్సుపై రవ్వంత దయతో ఉంచుతల్లీ!

★ ★

శివాయ గౌరీ వదనారవింద
సూర్యాయ దక్షాధ్వర నాశనాయ
శ్రీ నీలకంఠాయ వృషధ్వజాయ
తస్మై శికారాయ నమశ్శివాయ

—శివపంచాక్షర స్తోత్రం

## 85. పాదాబ్జములు

నమోవాకం బ్రూమో నయనరమణీయాయ పదయోః
తవాస్మై ద్వంద్వాయ స్ఫుటరుచిరసాలక్తకవతే
అసూయత్యత్యంతం యదభిహననాయ స్పృహయతే
పశూనామీశానః ప్రమద వన కంకేళి తరవే

పద్యము

అఖిల మునిగణ సంసేవితా! మదంబ!
మంచుమలరాయరాణి! క్రొమ్మించుబోణి!
రంగులద్దిన పసుపుపారాణితోడ
దివ్యసుందర విస్ఫుర త్తేజములకు
రత్న మాణిక్య మంజీర రాజితోడ
నయనపర్వమ్ము సేయు సౌందర్యధుర్య
పూజ్య పాదాబ్జములకు నమోనమోస్తు!
తల్లి! నీ పాదరాజీవతాడనమున
తనువు పులకించి పుష్పించి తనరుచున్న
ప్రమదవనిలో అశోకవృక్షమును జూచి
ఆ తరువు భాగ్యమునకు ఈర్ష్యాళువయ్యె
శివుని మానసికస్థితి చెప్పగలమె
సుందరారుణ పాదారవింద యుగళ!

వ్యాఖ్య

అమ్మా! నీవు పాదాలకు పారాణి పెట్టుకొని మంజులమణి మంజీరాలు ధరించుకొని రాగరసరంజిత చరణాలతో కూర్చున్నావంటే ఎవనికైనా నిజంగా నీ పాదాలపై ప్రణమిల్లాలనీ ముద్దుపెట్టుకోవాలనీ నమోవాకం చెప్పాలనీ అనిపిస్తుంది తల్లీ! నీవు ప్రమదవనంలో పుష్పవృక్ష దోహదక్రియకు వెళ్ళి అశోకవృక్షరాజాన్ని పాదతాడనం చేస్తుంటే ఆ తరుశేఖరానికున్న అదృష్టం ఈ చంద్రశేఖరుడికి కలుగకపోయెనే అని శివుడంతటివాడు అశోకంపై అసూయ వహిస్తాడంటే అతిశయోక్తి కాదమ్మా! నీ పాదాకర్షణ అట్టిది.

★ ★

నమ్మితి నా మనంబున సనాతనులైన ఉమామహేశులన్
మిమ్ము పురాణదంపతుల మేలు భజింతుగదమ్మ మేటి పె
ద్దమ్మ! దయాంబురాశివిగదమ్మ! హరిన్ పతిజేయుమమ్మ నిన్
నమ్మినవారి కెన్నడును నాశములేదుగదమ్మ ఈశ్వరీ!

—బమ్మెర పోతన

# 86. ప్రణయకోపన

మృషా కృత్వా గోత్రస్ఖలన మథ వైలక్ష్యనమితం
లలాటే భర్తారం చరణకమలే తాడయతి తే
చిరాదంతశ్శల్యం దహనకృత మున్మూలితవతా
తులాకోటి క్వాణైః కిలికిలిత మీశాన రిపుణా

పద్యము

తరుణి! కల్యాణి! దివ్య సౌందర్య రమణి!
ప్రాణనాథుండు నీ సమీపమున మరచి
అన్యనాయిక పేరెత్తినంత నీవు
ఎట్లు శిక్షించినావో! ఫాలేక్షణుండు
ఫాలమును మోడ్చె నీ మృదు పదములందు
ప్రణయకుపితవై పాదమ్ము లాగుకొనగ
'నీవు పతిఫాలద్రుక్కు తన్నితి' వటంచు
హృదయశల్యమ్ము వోవగా ముదముజెంది
అలరువిల్కాడనంగుడు హరునివైరి
పరపకాలున నవ్విన పగిదిగాగ
కాలి అందెలు ఘల్లుఘల్ ఘల్లుమనియె

వ్యాఖ్య

అమ్మా ! అమృతాంశుమౌళి అనుకోకుండా పొరపాటున నీతో మాట్లాడుతూ ఎరధ్యానంగా పరనాయిక నామం స్మరించాడు కదా ! నీవు అది వినీవినగానే ఈర్ష్యాకషాయితనేత్రవైనావు నీ కంటిలో జేగురురేఖ చూచి స్వామికి ఏమి చేయటానికి తోచక అచ్చె రువుతో నీ అడుగులపై తలవాల్చాడు శివఫాలం నీ పాదమంటింది 'అయ్యో' అని నీవు నీ అడుగుదమ్ముల్ని ఇవతలకు లాక్కున్నావు కదమ్మా ! ఇపుడు చరణ మణిమంజీరాలు కిలకిలారావాలు చేశాయి ఆ రావాలు మన్మథ పరిహాసాలు తల్లీ ! విజయధ్వానాలు అవి దీని కోసం దాగి ఉన్న మన్మథుడు ఈ దృశ్యం చూచి ఈ కన్ను నన్ను కాల్చుకుతిన్న ఘూటో కన్ను మా కన్నతల్లి దీనిని బాగా తన్నిం దితే నా పగ తీరిందిలే కంటికి తగినశాస్తి జరిగింది అనుకొని ప్రతీ కారవాంఛతో హృదయశల్యంగా ఉన్న ఈ పగను తలచుకొని మరుడు పగలబడి నవ్వుతున్నాడమ్మా ! ఆ మహిత మంజీరధ్వనులు మాకు కల్యాణకింకిణులగుగాక !

 

శైలరాజస్య జామాత శ్శశిరేఖావతంసక
నమస్తుభ్యం నమస్తుభ్యం నమస్తుభ్యం మహేశ్వరి

—ఉమామహేశ్వరాష్టకం

## 87. పాదయుగము

హిమానీ హంతవ్యం హిమగిరినివాసైకచతురౌ
నిశాయాం నిద్రాణం నిశి చరమభాగే చ విశదౌ
వరం లక్ష్మీపాత్రం శ్రియమతిసృజంతౌ సమయినాం
సరోజం త్వత్పాదౌ జనని జయత శ్చిత్ర మిహ కిమ్

పద్యము

అమృతశక్తి ప్రదాయినీ! ఆదిశక్తి
మంచుకొండకోనఁ బర్యటించగలిగి
చెతనాశక్తి ప్రసరింపఁజేయుకలిగి
సమయవర్తనులకు శ్రీలు శక్తులొసగి
రాత్రివేళల చరమరాత్రమ్ములందు
సుప్రసన్నమ్ములై మహాశోభలందు
పరమ పూజార్హమైన నీ పాదయుగము
ఉత్తమంచుచే నేలకు నొరిగిపోయి
రేయి ముకుళించుకొనిపోయి హాయిదొరగి
పగలుమాత్రమె సుంబ సంబరమ్ముగొలిపి
చపల కిరవైనవగు జలజములపైని
విజయమందుటలో తల్లి! వింత ఏమి?

## వ్యాఖ్య

అమ్మా! నీ పాదాలు కిసలకల్హారాలకంటె సువిలసితాలు మహామహిమోన్నతాలు పరమపునీతాలు హిమశైల పుణ్యభూములలో రాత్రింబవళ్ళు సంచరించే సమయాచార భక్తులకు నీ చరణాలు నిత్యం సుఖంకరణాలు వారి మానసాలకు చైతన్య జ్ఞాన కిరణాలు సౌభాగ్యలక్ష్మి ఆభరణాలు అవి మోక్షలక్ష్మీకరాలు ఆనందవర్ధన కరాలు అమూల్యవరాలు మంచు మాత్రంచేత అణిగి కృశించేవి రాత్రులందు ముడుచుకుపోయేవి అయిన కమలాలు, పగలు ముకుళించుకుపోయే కల్హారాలు నీ పాదాలతో సామ్యం చెప్పటానికే తగవు తల్లీ! నీ పాదాలు ఆ పుష్పాల సౌందర్యాన్ని జయిస్తున్నాయి అంటే ఆశ్చర్యమేముంది? తల్లీ!

★ ★

దేహినాం జీవభూతోఽసి జీవజీవస్య కారణం
జగతాం రక్షకస్త్వం వై మృత్యుంజయ నమోస్తుతే!

—మృత్యుంజయ స్తోత్రం

## 88. కాలు త్రొక్కుట

పదం తే కీర్తీనాం ప్రపద మపదం దేవి విపదాం
కథం నీతం సద్భిః కఠినకమఠీకర్పరతులాం
కథం వా పాణిభ్యా ముపయమనకాలే పురభిదా
యదాదాయ న్యస్తం దృషది దయమానేన మనసా

పద్యము

కీర్తికౌముదీ ప్రభల నికేతనమ్ము
ఆర్తివహ్నికి వర్షధారాంబుదమ్ము
కుసుమ సుందర సుకుమార కోమలమ్ము
నీ పదయుగమ్ము కాత్యాయనీ ! భవాని
కవులు పాదోపరితలాలు కఠినములగు
కమఠి వీపుల నుపమింప కలిగి రెట్లు ?
అమ్మ ! శర్వాణి ! నీదు కల్యాణవేళ
అమిత మృదుతరంబగు నీ పదాంబుజమ్ము
సదయు డదయుడై ప్రియుడు హస్తములబట్టి
పరమ కఠినమౌ సనికల్లుపైన బెట్టి
కాలితో[1] నెట్లు స్పృశియింపకలిగెనమ్మ !
పద్మసంభవ వందిత పద్మపాద !
లలిత మందారవల్లి ! బాలామతల్లి !

వ్యాఖ్య

అమ్మా! భవానీ! రాజరాజేశ్వరీ!

సర్వమంగళాలకూ సద్యశస్సంపదలకూ ఉనికి పట్టైనవి నీ పాదాలు ఆపదలు హరించటంలోనూ సంపదలు అందించటంలోనూ సకల సమర్థవంతాలు నీ అడుగుదమ్ములు అవి పరమ సుకుమారాలు అత్యంత మనోహరాలు శిరీష కుసుమపేశలాలు ఈ పాద ఉపరిభాగాలను కవీశ్వరులు కర్కశమైన కమఠి వీపులతో ఎలా పోల్చి కవితలల్లారు తల్లీ! కలితకళ్యాణవేళ శశికళాధరుడు పరమసుకుమారమైన నీ పాదాన్నిపట్టి వసువు నూడుకొనే పాదు పొత్రంపై ఎలా పెట్టగలిగాడు ఎలా త్రొక్కగలిగాడు! అవి తలచు కొంటేనే కంట నీరు వస్తుందే!

★ ★

ఝుణ త్క్వణ త్కంకణ నూపురాయై
పాదాబ్జరాజ త్ఫణి నూపురాయ
హేమాంగదాయై భుజగాంగదాయ
నమః శివాయైచ నమశ్శివాయ!

—అర్ధనారీశ్వరాష్టకం

## 89. పాదపద్మములు

నఖైర్నాకస్త్రీణాం కరకమలసంగోచ శశిభిః
తరూణాం దివ్యానాం హసత ఇవ తే చండి చరణౌ
ఫలాని స్వఃస్థేభ్యః కిసలయకరాగ్రేణ దదతాం
దరిద్రేభ్యో భద్రాం శ్రియమనిశ మహ్నాయ దదతౌ

పద్యము

అమిత కరుణాసమేత ! విద్యాపునీత !
పరమమునినుత ! ఆశ్రితపారిజాత !
కల్పవృక్షమ్ము దేవసంఘమునకెల్ల
చిగురుమునివ్రేళ్ళనిచ్చు నీప్సితఫలాలు
స్వర్గ భూలోక సకలార్థిజనులకెల్ల
సంతత శ్రీలొసంగు నీ చరణరజము
కల్పకమ్ములుగలవను గర్వితులగు
అమరకాంతలు నీ పాదకమలములకు
మస్తకమ్ములు వంచి నమస్కరింప
జనని ! నీ కాలిగోళ్లు కొంచమ్ము వంగి
మనసులో నవ్వుకొనుచున్నవని తలంతు
తెలివెలుంగులు వెలికిచిందినవి చూడు—

వ్యాఖ్య

అమ్మా ! స్వర్గంలోని కల్పవృక్షాలు చిగురుటాకుల చేతులతో మునివ్రేళ్ళతో మహాభాగ్యవంతులైన స్వర్గవాసులకు మాత్రమే మెల్ల మెల్లగా చూచి చూచి ఇష్టార్థాలు ప్రసాదిస్తుంటాయి కానీ నీ పాదాలు సకలలోకవాసులకూ దీనహీన జనులెల్లరికి అడిగీ అడగకుండగనే సర్వ మంగళకరంగా సిరిసంపదలు ఇబ్బడి ముబ్బడిగా ఇస్తుంటాయి తల్లీ ! ఇది గమనించి శచీదేవ్యాదులు వచ్చి నీ పాదాలపై చేతులు మోడ్చి నమస్కరిస్తుంటారు అపుడు ఆ ముకుళించుకొన్న హస్తపద్మాల చివరి నఖాలు చిన్నబుచ్చుకొంటాయి నీ పాదాలగోళ్ళు పరిహాసపూర్వకంగా నవ్వుతుంటాయి

★ ★

పాయాన్నిశాదౌ శశిశేఖరో మాం
గంగాధరో రక్షతు మాం నిశీథే
గౌరీపతి పాతు నిశావసానే
మృత్యుంజయో రక్షతు సర్వకాలమ్ !

—శివ కవచమ్

## 90. చరణారవిందాలు

దదానే దీనేభ్యః శ్రియమనిశ మాశానుసదృశీ
మమందం సౌందర్యప్రకర మకరందం వికిరతి
తవాస్మిన్ మందార స్తబక సుభగే యాతు చరణే
నిమజ్జ న్మజ్జీవః కరణచరణైః షట్చరణతామ్

పద్యము

పుష్పితాస్త్రసాయకా! పద్మనయన!
ఆత్మవిద్యాప్రదాయినీ! అబ్జవదన!
కోరుకొన్నన్ని శ్రీలు చేకూర్చుచుండు
దివ్య సౌందర్య మధువు చిందించుచుండు
అతిసమర్థమై మహి అలరారు నీదు
సుందరారుణ చరణారవిందమందు
ఈ షడింద్రియభావ ప్రవృద్ధ జీవి
షట్పదంబయి మనుగాక శారదాంబ!

## వ్యాఖ్య

అమ్మా! నీ పాదం ఒక మహాపద్మం తల్లీ! ఆ పద్మం సతతం శ్రీలు చిందిస్తూ ఉంటుంది. సర్వదా ఆనందం ప్రదానం చేస్తూ ఉంటుంది. లలితలావణ్యం అనే పుప్పొడిని వెదజల్లుతూ ఉంటుంది. జ్ఞానం ఇస్తుంది. ధ్యానం నేర్పుతుంది. ఆత్మాభిమానం కలుగజేస్తుంది. ఆత్మను అందిస్తుంది. అమృతం చవిచూపిస్తుంది. అట్టి కల్పకం అయిన నీ పదకమలంపై షట్పదాన్నై జీవిస్తాను. ఆ వరం అనుగ్రహించు తల్లీ! నాకు పాదాలు రెండే అనుకొంటావేమో! నేనూ షట్పదాన్నే అమ్మా! మనస్సూ - శ్రోత్రం - నేత్రం - ఘ్రాణం - జిహ్వ - త్వక్కూ ఈ ఆరూ నా పదాలు. ఈ షట్పదాన్ని నీ పద పద్మంపైకి రానీ తల్లీ!

★ ★

కృతార్థోఽహం కృతార్థోఽహం కృతార్థోఽహం మహేశ్వరః
అద్యతే పాదపద్మస్య దర్శనాద్భక్త వత్సలః!

—అగస్త్యాష్టకం

# 91. హంసపదన్యాసము

పదన్యాసక్రీడా పరిచయమివారబ్ధుమనసః
స్ఖలంతస్తే ఖేలం భవనకలహంసా న జహతి
అతస్తేషాం శిక్షాం సుభగమణిమంజీర రణిత
చ్ఛలా దాచక్షాణం చరణకమలం చారుచరితే

పద్యము

సత్య శివ సుందర చరిత్ర ! చారుగాత్ర !
హంసవాహన ! ఓ కలహంసగమన !
భవ్య భవదీయ దివ్య సంభావ్యమాన
పాదవిన్యాస నవ కళాభ్యాసమునకు
మోజుపడినట్టి కలహంసరాజసమితి
నిన్ను విడనాడకున్నది నీరజాక్షి !
నీ పదన్యాస నైపుణి నేర్వలేక
చరణములు తొట్రుపడుచుండ జనని ! నీదు
చరణ మంజీర రవళి హెచ్చరికలిచ్చు
చున్నదా యన్నవిధమున నుండునమ్మ !

## వ్యాఖ్య

అమ్మా! చారుచరితా! మాతా! నీ నడకల సోయగం హృదయంగమంగా ఉంది నీ గమన విలాసాన్ని అనుకరించాలని నీ అంతఃపురంలోని రాజహంసలు శతవిధాల ప్రయత్నించి అనుకరించలేక విఫలమవుతున్నాయి అయినా ఇంకా అవి శిక్షణ పొందుతూనే ఉన్నాయి నీ పదవిన్యాసం అంత గొప్పది కలహంసలను పరవశం చేస్తుందికదా! ఆ గమన కళకు ఇంకా అవి ఆరాటపడుతూనే ఉన్నాయి అందుకై నిన్ను విడిచి క్షణం కూడా ఉండలేకున్నాయి. నీ అడుగుల్లో అడుగువేస్తూ నీ పదమంటి నడుస్తున్నాయి అలా వచ్చే రాయంచలకు నీ చరణ మణిమంజీరాలు రమణీయరావం మిషగా పద విన్యాసం జాగ్రత్తగా అభ్యసించుమని హెచ్చరికలిస్తున్నట్లున్నాయి తల్లీ! అందాల జాబిల్లీ!

★ ★

నమోస్తు శర్వాయ నమశ్శివాయ
నమోస్తు సిద్ధాయ పురాంతకాయ
నమోస్తు కాలాయ నమః కాలాయ
నమోస్తు తే జ్ఞాన వరప్రదాయ!

—శివ స్తోత్రం

## 92. శయ్యాసౌభాగ్యము

గతాస్తే మంచత్వం ద్రుహిణహరిరుద్రేశ్వరభృతః
శివ స్వచ్ఛచ్ఛాయా ఘటితకపట ప్రచ్ఛదపటః
త్వదీయానాం భాసాం ప్రతిఫలన రాగారుణతయా
శరీరీ శృంగారోరస ఇవ దృశాం దోగ్ధి కుతుకమ్

### పద్యము

శుద్ధ విద్యాస్వరూపిణీ ! శోభనాంగి !
బ్రహ్మ విష్ణు రుద్రేశ్వర ప్రభువు లంత
అమ్మ ! నీ మహావిశ్వశయ్యను ముదాన
భక్తితో శ్రద్ధతో మహాభాగ్యమనుచు
మోయుచున్నారు ఒకమంచమునకు నాల్గు
కోళ్ళవోలెను నాల్గుదిక్కులుగ నిలిచి
ధవళకాంతుల శుద్ధవస్త్ర స్వరూప
మెత్తివచ్చిన శివుడు నీ యెఱ్ఱనైన
మేని ధగధగద్ధగలతో తానుకూడ
రక్తిమను పొంది శృంగారరసము రూపు
దాల్చినాడో యనంగ మోదమ్ము కలుగ
జేయుచున్నాడు సరసుడై చిన్నితల్లి !

వ్యాఖ్య

అమ్మా! ఆదిమశక్తి! అన్నపూర్ణా!

బ్రహ్మ విష్ణు రుద్రేశ్వరులు నలుపుడూ తత్వాంతర్గతులు కామరూపులు మహాభక్తులు నీ పదానురక్తులు ముక్తులు. వారు నీ వధిష్ఠించు మణిస్థగిత శయ్యాపీఠానికి నాల్గుప్రక్కల నాలుగు స్తంభాకృతులలో నిలబడి నిన్ను సేవిస్తున్నారు సదాశివ తత్త్వాత్మకుడైన పరమశివుడు స్వచ్ఛక్షేమాంబరమై నీ పచ్చడమై రాణిస్తున్నాడు పరిశుద్ధ శ్వేతకాంతిగల సదాశివుడు నీపే ని బంగారు కెంపులు సోకి అనురాగరంజితుడైనాడు శృంగార రసమూర్తి అయినాడు నీకు నేత్రపర్వం కలిగిస్తున్నాడు ఇది అంతా నీ లీలా విలాసం

శ్రీచక్ర ద్వారాల నాల్గింటియందు నివసించు మాయాదులు ఈ నాల్గు తత్త్వాలే మాతృశ్రీ శయ్యకు నాలుగు స్తంభాలే సుమా. సదాశివ తత్త్వానికి శుద్ధ విద్యాచ్ఛాయ ప్రాప్తిచే సహస్ర కమలాంతర్గతుడైన శివుడు అనురాగమూర్తియై శుద్ధవిద్యతో తాదాత్మ్యం చెందినాడు ఇది సహస్రార శ్రీచక్రంలో బైందవ స్థానంలో శివశక్తి సమ్మేళనం.

★ ★

హిమాద్రి శిఖరాకార సుధావీచి మనోహర
పుండరీక పరంజ్యోతి ర్మృత్యుంజయ నమోస్తుతే
—మృత్యుంజయ స్తోత్రం

## 93. శివుని రాణి

అరాళా కేశేషు ప్రకృతిసరళా మందహసితే
శిరీషాభా చిత్తే దృషదుపలశోభా కుచతటే
భృశం తన్వీ మధ్యే పృథురురసిజారోహవిషయే
జగత్త్రాతుం శంభో ర్జయతి కరుణా కాచిదరుణా

పద్యము

రాజబింబానన ! సుధామరాళగమన !
నీ స్వభావమ్ము సరళమ్ము - నీ అలక ల
రాళములు - అతి కఠినోపలాలు చనులు -
నవశిరీషపేశలము మనస్సు - నడుము
సూక్ష్మమ్ము - కుచ నితంబముల్ స్థూలములు - అ
వర్ణనీయమ్ము నీ సుషమార్ణవమ్ము
పరమశివుని ప్రాణాంగనా ! పద్మవదన !
అరుణ ! కరుణతో బ్రోవవే ! అబ్జచరణ !

వ్యా ఖ్య

అమ్మా ! అరుణా ! నీ రూపం అందానికి దీపమై కెంపులు విరజిమ్ముతున్నదమ్మా ! నీ నెరికురులు నొక్కులుతీరి ఉంగరాలు తిరిగి తుమ్మెదరెక్కలవలె వంకరలుపోయి నిగనిగలాడుతూ మనోజ్ఞంగా ఉన్నాయి నీ మదుర మందహాసం విలాసవంతంగా సహజ సుందర తరంగా విలసిల్లుతున్నది నీ మృదుమానసం శిరీషకుసుమ పేశలమై లలితలలితంగా నవనీత మధురంగా మహామహిమాన్వితంగా భాసిస్తు న్నది నీ స్తనద్వయం కఠిన కమనీయ చంద్రోపల సదృశంగా విరా జిల్లుతున్నది నీ లేగౌను అస్తినాస్తి విచికిత్సకు గురి అవుతున్నది నీ నితంబం విరివికలిగి విడంబమై విజృంభించి ఉంది ఇట్టి అపు రూపమైన నీ రూపసంపద శంభుని కరుణారసంతో మెరిసిపోతూ జగత్తును అరుణిమంలో ముంచెత్తుతున్నది ఈ నీ అరుణరూపం జగత్తు రక్షింప సర్వసమర్థమై సర్వాతిశాయియై రాణిస్తున్నది !

అమ్మా ! అరుణా ! అభివాదాలు_

★ ★

శివాకాంత శంభో శశాంకార్ధ మౌళే
మహేశాన శూలిన్ జటాజూటధారిన్
త్వమేకో జగదావ్యాపకో విశ్వరూప
ప్రసీద ప్రసీద ప్రభో పూర్ణరూప !

—వేదసార శివస్తోత్రం

## 94. మరకత కరండము

కళంకః కస్తూరీ రజనికరబింబం జలమయం
కళాభిః కర్పూరై ర్మరకతకరండం నిబిడితమ్
అత స్త్వద్భోగేన ప్రతిదిన మిదం రిక్తకుహరం
విధి ర్భూయోభూయో నిబిడయతి నూనం తవ కృతే

పద్యము

చంద్రశేఖరస్వామి యోషాలలామ !
సోముని కళంక మచ్చ కస్తూరిబొట్టు
జలము పన్నీరు - చంద్రు ప్రసారకళలు
అభ్ర కర్పూర ఖండమ్ము లై రహింప
నీ కలంకార సామగ్రి నింపబడిన
మరకత కరండ మీ చంద్రమండలమ్ము -
కమలసంభవు డత్యంత గౌరవమున
నీకు భోగార్థమై మహానిష్ఠతోడ
దినదినమ్మును ఇంత వెల్తిపడకుండ
చంద్రబింబకరండము సాంద్రగతుల
నింపుచున్నాడు, సౌదామినీ లతాంగి !

వ్యా ఖ్య

అమ్మా ! అందాల చందమామా ! నింగిలోని చందమామ నీకు అందాలు దిద్దుకొనే అద్దాలబరిణ అయింది తల్లి ! నీ సౌందర్య సాధనాసామగ్రి కరండం చంద్రబింబం ఎంత అందమైన వెండిపెట్టె అమ్మా అది చందమామలోని కళంకం నీకు కస్తూరి అయింది చంద్ర కళాఖండాలు నీకు కర్పూరఖండాలు అయినాయి అమృతాంశువులోని అమృతం నీకు పన్నీరు అయింది చంద్రబింబం నీకు కరండమైంది. నీవు చందమామ బరిణలోని సౌందర్య సామగ్రి నిత్యం వాడుతుంటే అవి నిత్యం అయిపోతున్నాయి అది గమనించి అరవిందసూతి అను క్షణం అవి తరుగకుండ మరల మరల ఆ సామగ్రిని నింపుతున్నాడు తల్లీ ! అందాల జాబిల్లి !

★ ★

కస్తూరికా కుంకుమ చర్చితాయై
చితారజః పుంజ విచర్చితాయ
కృతస్మరాయై వికృత స్మరాయ
నమః శివాయైచ నమః శివాయ

—అర్ధనారీశ్వరాష్టకం

## 95. పూజా సపర్య

పురారాతే రంతః పురమసి తత స్త్వచ్చరణయో
స్సపర్యా మర్యాదా తరళకరణానా మసులభా
తదా హ్యేతే నీతా శ్శతముఖముఖా స్సిద్ధిమతులాం
తవ ద్వారోపాంత స్థితిభి రణిమాద్యాభి రమరాః

పద్యము

అల పురాంతక పరమ శుద్ధాంతకాంత !
పార్వతీదేవి ! నీ పాదపద్మపూజ
చపలచిత్తుల కెట్లుల సాధ్యమగును
ఇంద్ర చంద్రాది సురవర్యులెల్ల వారు
నీ మహామందిర ద్వారసీమ నిలిచి
ద్వారపాలురచేతనే వరములంది
అష్టసిద్ధులుపొంది ప్రహర్షమంది
ప్రభువులై ఇష్టసంపదలుజెంది
ఇంకచాలనుకొన్నారు ఏమి ఎరుగు
నీ పదార్చ సుఖమ్ము అందించు ఫలము !

వ్యాఖ్య

అమ్మా! త్రిపురసంహార వీరమూర్తి పట్టమహిషీ! త్రిపుర సుందరీ! నీ శ్రీచరణార్చన అల్పులకు అలభ్యం చంచల మనస్కులు అందుకు అర్హులేకారు భోగభాగ్యాలపైన పదవీవ్యామోహం పైన మనసున్న మలినచిత్తులు ఇంద్రాదులు నీ శుద్ధాంతంలోనికి ప్రవేశింపనేలేరుకదా! ఆ ఇంద్రాదులు నీ ద్వారపాలకుల కాళ్లు పట్టుకొని ప్రాధేయపడి అణిమ గరిమాది శక్తిసంపదలు పొంది ఇవే మాపాలికి పదివేలనుకొని అధికారపీఠంపై ఐహికభోగాలు పొందుతున్నారు ఆ ఐహికాలు నీ పరిచారికలే ప్రసాదిస్తారు నీవు మహా శాశ్వతానంద సుఖసంపదలిస్తావు అల్పబుద్ధులు నిన్ను నియమానుసారంగా అర్చించలేకపోతున్నారు ఏ మహా పుణ్యాత్ములకో నీ శ్రీపాదార్చన భాగ్యం ప్రాప్తిస్తుంది తల్లీ!

★ ★

హే! చంద్రచూడ మదనాంతక శూలపాణే
స్థాణో గిరీశ గిరిజేశ మహేశ శంభో
భూతేశ భీత భయసూదన మామనాథ
సంసార దుఃఖ గహనా జ్జగదీశరక్ష

—శివనామావళ్యష్టకం

## 96. పతివ్రత

కళత్రం వైధాత్రం కతికతి భజంతే న కవయః
శ్రియో దేవ్యాః కోవా న భవతి పతిః కైరపి ధనైః
మహాదేవం హిత్వా తవ సతి సతీనామచరమే
కుచాభ్యా మాసంగః కురవకతరో రప్యసులభః

పద్యము

మూలవిగ్రహరూపిణీ ! ముక్తినిలయ !
ఎవరు బ్రహ్మాణి గొలిచి సత్కవిత బడసి
శారదా వల్లభులటంచు పేరుగొనరు ?
ఎవరు హరికళత్రము గొల్చి ఇష్ట ధనము
లంది లక్ష్మీపతులటంచు ఖ్యాతిగసరు ?
కాని శర్వాణిగొలిచి ఒక్కండుగూడ
అంబపతికాడు ! గోరంటయైన తుదకు
దోహదముకైన చన్నంట మోహపడదు
తల్లి ! మచ్చలేని పతివ్రతామతల్లి
గౌరి ! నీ సౌరు వర్ణింపగలరె కవులు !

వ్యాఖ్య

అమ్మా! శర్వాణీ! నీవు మహాపతివ్రతా శిరోమణివి తల్లీ! ఇది అతిశయోక్తి కాదు ఒకటి చెప్తా విను కొందరు సరస్వత్యుపాసన చేసి సరస్వతిని పోషించి సాహితీవల్లభులు అని బిరుదులు అందుకొంటున్నారు మరికొందరు కవులు బ్రహ్మ తల వంచుకొనేలా 'వాణి నా రాణి' అంటూ మరీ సవాలు చేస్తున్నారు ఇక లక్ష్మీదేవి సంగతి మాట్లాడమంటే నాల్గు పైసలుగల ప్రతివాడూ తాను 'లక్ష్మీపతి' నంటాడు

కానీ ఏ ఒక్క భక్తుడూ ఇంతవరకూ నేను 'పార్వతీ పతిని' అన్నవాడు లేడు అంబాపతిని అని చెప్పుకొనే గౌరవం ఆ ఒక్క సదాశివుడికే చెల్లింది కనుక నీవే పతివ్రతవు నీ సంశ్లేషణ భాగ్యం ఆ శివమూర్తికే కానీ చివరకు దోహదక్రియా నెపంతో జడప్రాయమైన కురవక వృక్షానికి కూడా లభించటంలేదు ఆ పవిత్ర పూజ్య పునీత లక్షణం నీయందే సార్థకమయింది తల్లీ!

★ ★

సోమనాథుని త్రిభువనస్వామినాథు
పార్వతీనాథు శశ్వత్ప్రకాశనాథు
ఉక్షవాహాధినాథు వేదత్రయైక
నాథు నానాథు గొలుతు శ్రీనాథునాథు!

—భీమేశ్వర పురాణం

## 97. మహాదేవి

గిరా మాహుర్దేవీం ద్రుహిణగృహిణీ మాగమవిదో
హరేః పత్నీం పద్మాం హరసహచరీ మద్రితనయామ్
తురీయా కాపి త్వం దురధిగమనిస్సీమమహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషి

పద్యము

హే పరబ్రహ్మ పట్టమహిషి! అమోఘ
మహిత మానస! లోకైకమాత! సకల
వేదవిదులు శ్రీవిద్యా ప్రవీణులనిరి -
"బ్రహ్మదేవునిరాణి శ్రీవాణి వీవు
శ్రీమహావిష్ణుగృహిణి లక్ష్మియన నీవు
శివుని అర్థాంగియైన హైమవతి వీవు
ముగ్గురమ్మల నడిపించు మూలమీవు
ఈవని" వచించిరే మహాదేవదేవి!
నీవు నిట్టట్టులనరాని నిగ్గువమ్మ
దురధిగమములు నిస్సీమకరములైన
మహిత మాయాస్వరూప సంపదలతోడ
విశ్వము వివర్తన మొనర్తువే భవాని!

## వ్యాఖ్య

అమ్మా! నీవు సచ్చిదానంద పరబ్రహ్మ అయిన సదాశివుని ప్రాణేశ్వరివి తల్లీ! అమ్మలగన్న అమ్మవు ముగురమ్మల మూలపుటమ్మవు అన్నీ నీవే కదా దేవీ! నీవు కానిది ఏమున్నదమ్మా! వివిధాగమరహస్యజ్ఞులైన మహాపండితులు నిన్ను బ్రహ్మాణి అయిన సరస్వతీమూర్తిగా ఆరాధిస్తారు ఆ కోవిదులే మరో వైపు నిన్ను శ్రీ మహావిష్ణురాజ్ఞి మహాలక్ష్మీదేవిగా శ్రీచక్రార్చన చేస్తారు ఆ తత్త్వజ్ఞులే ఇంకొకతడవ నిన్ను సదాశివ ధర్మపత్నిగా ఆత్మనివేదన చేసికొంటారు, ఆదిమశక్తివని పూజిస్తారు ఆలోచించి చూస్తే నీవు కానిది ఏమి ఉన్నది తల్లీ! సర్వం నీవే ఉత్తమ తేజోరాశివి నీవే నిత్య దేశాతీత కాలాతీత వస్తుతీయ అపరిచ్ఛిన్న అప్రమేయ అమోఘ అపరిమిత మహిమాన్విత శుద్ధమాయాదేవివి! నీవే విశ్వాన్ని విస్తరింపజేస్తావు. భాసింపజేస్తావు భ్రమింపజేస్తావు పరబ్రహ్మనుండి శుక్తియందు రజతంవలె విభ్రాంతి కలిగిస్తావు శుద్ధ విద్యా మహామాయాతత్త్వం నీవే తల్లీ! నమోస్తు!

★ ★

భవాయ చంద్రచూడాయ నిర్గుణాయ గుణాత్మనే
కాలకాలాయ రుద్రాయ నీలగ్రీవాయ మంగళమ్
వృషారూఢాయ భీమాయ వ్యాఘ్రచర్మాంబరాయ చ
పశూనాంపతయే తుభ్యం గౌరీకాంతాయ మంగళమ్

—శివమంగళాష్టకం

## 98. పాదతీర్థపం

కదా కాలే మాతః కథయ కలితాలక్తకరసం
పిబేయం విద్యార్థీ తవ చరణ నిర్ణేజనజలమ్
ప్రకృత్యా మూకానా మపి చ కవితా కారణతయా
కదా ధత్తే వాణీ ముఖకమల తాంబూల రసతామ్

### తాత్పర్యము

వాంఛితార్థ ప్రదాయినీ! వరదహస్త!
లలిత పల్లవాలంకృత లక్తపాద
మూలమంత్రాభిషేక ప్రపూతజలము
అమ్మ! నీ కృపావిద్యార్థినైన నాకు
ఎప్పు డొసగెదో దయచేసి చెప్పు తల్లి!
నీ జలము స్వభావముచేతనే అభీష్ట
సిద్ధులందించు లోకప్రసిద్ధజలము
మూక బధిరాది బహుజనమ్ములకుగూడ
సత్కవిత నెప్పు కవితారసమ్ము గ్రోల
మూలకారణమైనది పుణ్యశీలి
వాణి తాంబూలరసముగా వాసిగాంచె!

వ్యాఖ్య

అమ్మా! భువనిరాణీ! నీ పారాణిపాదాలకు అభివాదాలు నీ మృదు పాదాలు మంగళ హరిద్రాంకితాలు సర్వాభరణాలంకృతాలు పరమప్రసీతాలు నీ చరణారవిందాలను అభిషేకించిన జలం మహామందాకినీ జలం కంటే మహిమాన్వితం ఆ నీ పవిత్ర పాదతీర్థం నా జీవితకాలంలో ఏ ఒక్కసారైనా అనుగ్రహిస్తావా మాతా!

నే నెప్పుడు నీ పాదోదకం పుచ్చుకొంటానో! నీ పాదతీర్థంలోని ఒక బిందువు మూగవాడికి వచోశక్తిని ఇస్తుంది కుంటివాడికి కొండలు దూకే జవశక్తి చేకూరుస్తుంది చెవిటివాడికి శ్రవణశక్తినిస్తుంది గురుశిక్ష లేకుండగనే మందమతికి కవితాశక్తిని ఆవిర్భవింపచేస్తుంది నీ పాదజలం ఏది ఈయలేదు? అన్నీ ప్రసాదిస్తుంది అట్టి నీ పాదాలు కడిగిన లత్తుకజలం లవం అందించుతల్లీ!

★ ★

అయి గిరినందిని నందిత మోదిని విశ్వవినోదిని నందినుతే
గిరివర వింధ్య శిరోధినివాసిని విష్ణువిలాసిని జిష్ణునుతే,
భగవతి హే శితికంఠ కుటుంబిని భూరి కుటుంబిని భూరికృతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

## 99. ఫలప్రాప్తి

సరస్వత్యా లక్ష్మ్యా విధిహరి సపత్నో విహరతే
రతేః పాతివ్రత్యం శిథిలయతి రమ్యేణ వపుషా
చిరం జీవన్నేవ క్షపిత పశు పాశ వ్యతికరః
పరానందాభిఖ్యం రసయతి రసం త్వద్భజనవాన్

### పద్యము

ఓ మహారాజ్ఞి! రాజేశ్వరి! మదంబ!
నీ మహాభక్తి చెసరి నిటుదేరి
వాణివలె మహామహిమను రాణినాగ
సకల సంగీత విద్యాలసజ్ఞుడగుచు
లక్ష్మి వలె ధీటు సర్వాంగలక్ష్మినాగ
పూర్ణ సంపద్విశాల మహాభోగియగుచు
దేహసౌందర్య మాధుర్య దీప్తితోడ
రతిమనోహరుండనగ - నిరంతరమ్ము
జీవపాశముల్ తెగి చిరంజీవియై న
దానిశ్చయము పరానంద తత్త్వసుఖము
అనుభవింపును తల్లి! ఆర్యా! భవాని!

వ్యాఖ్య

అమ్మా! సర్వమంగళా! సాదాఖ్యా! సమయరూపా!

నీ ఉపాసకుడు బహిరంగాను అంతఃశ్చక్రరంగాను కూడా మహా అదృష్టవంతుడమ్మా! బ్రహ్మ దేవేంద్ర ఉపేంద్రాదులను మించి మహా భోగభాగ్యాలు అనుభవిస్తున్నాడు తల్లీ! నీ భక్తుణ్ణి చూచి అందరూ ఇతడు విజ్ఞానంలోనూ కవితాశక్తిలోనూ మహాపాండిత్యం లోను 'శారదానాథుడు' అంటూంటే బ్రహ్మదేవుడు యితణ్ణి ఏమీ చేయలేక అనలేక అసూయతో చూస్తుంటాడమ్మా! అలానే మరొక భక్తుణ్ణి అందరూ ఇతడు సంపత్తిలోనూ ధన నిధులు కూడబెట్టడం లోనూ 'లక్ష్మీపతి' అంటూంటే విష్ణుదేవుడంతటివాడు ఏమీ చేయలేక అసూయతో చూస్తున్నాడు తల్లీ! ఇలా బహిరంగానేకాక అంతఃశ్చక్రరంగా కూడ మహావిజ్ఞానియై ఆనందమయుడు అవుతున్నాడమ్మా! అవిద్యాపాశం పూర్తిగా ఛేదించుకొని సదాశివతత్వ స్వరూపుడై 'పరానంద' సుఖాన్ని అనుభవిస్తున్నాడు జననీ! ఇది అంతా నీ కృపా విశేషం కాదా! నమస్సుమాంజలులు తల్లీ!

★ ★

ఈ రహస్యంబు చెప్పకు మెవ్వరికిని  
శంభు భక్తుని దత్యంత శాంతమతికి  
శ్రద్ధధానున కధిక విశ్వాసమతికి  
ననఘ మానసునకు ముముక్షునకు దక్క!

—కాశీఖండం

## 100. సమర్పణ

ప్రదీపజ్వాలాభి ర్దివసకర నీరాజనవిధిః
సుధాసూతే శ్చంద్రోపలజలలవై రర్ఘ్యరచనా
స్వకీయైరంభోభి స్సలిలనిధి సౌహిత్యకరణం
త్వదీయాభి ర్వాగ్భి స్తవ జనని వాచాం స్తుతిరియమ్ ।

శాశ్వతైశ్వర్య సౌందర్య సకల జనని !
తత్త్వమూర్తి విలసితౌదార్యహృదయ !
వేవెలుంగులకిక్కయై వెలుగుదొరకు
ఆ మహోదారమూర్తిదేవై వెలుంగు
ఇంత దివ్వెతో హారతి ఇచ్చినట్లు
వంద చలువలకిక్కయౌ చందురునకు
ఆ మహోదారమూర్తిదేవై వెలుంగు
ఇంత వలిసీడ పాద్యమ్ము నిచ్చినట్లు
సకల జలరాశి కిక్కయౌ సలిలపతికి
ఆ మహోదారమూర్తిదేవై వెలుంగు
జలముతీసి తర్పణము నొసంగినట్లు
నీవలన పుట్టి పెరిగిన నిన్ను రూప
[illegible] తరంగాలను సంగ్రహించి
ఇట్లు సౌందర్యలహరిగా ఇచ్చినాను
వాణి ! రుద్రాణి ! బ్రహ్మాణి ! వందనమ్ము !

## వ్యాఖ్య

అమ్మా! సౌందర్యలహరీ! వాఙ్మయలహరీ! కవితా విహారీ! భక్తరక్షణ కళాకౌశలహరీ! సదాశివమనోహరీ! సమయ చంద్రికామూర్తీ! సాయాఖ్యదేవీ! సత్యసాయి మహేశ్వరీ!

ఈ కావ్యలహరి నీకు అర్పిస్తున్నాను తల్లి! అనుగ్రహించి అందుకో తల్లి! ఇది నీకు నేనేదో గొప్పగా ఇచ్చాను అనికాదు ఇది అంతా నీదే నీదే నీకు సమర్పిస్తున్నాను బ్రహ్మాండాలు వెలిగించే మార్తాండునికి చిన్న కర్పూరం వెలిగించి హారతి ఇచ్చినట్లుగా. అమృతాంశువుకే చంద్రకాంతశిలలలో జాలువారే పన్నీరు తీసి అర్ఘ్యం సమర్పించినట్లుగా - శబ్దబ్రహ్మమయివి వాఙ్మయివి సౌందర్య కవితా మూర్తివి అయిన నీకు నీవిచ్చిన నీ దగ్గర నున్నదే తగునమ్మా అని ఈ చిన్ని మాటల మూట దక్షిణగా అంకితం యిస్తున్నాను. ఈ నా అమాయకత్వానికి నవ్వుకుంటున్నావు కదూ! ఇంతకుతప్ప నాకేమీ తెలియదమ్మా!

సాయిమాతా! అమ్మా! అభివాదాలు—

★ ★

లలిత కవితా మయూరి - విలాస శిఖరి
నవ్య సంపత్కరి పరమానందలహరి
నిత్య సౌందర్యలహరి సాహిత్య నగరి
సత్యసాయీశ్వరీ! మహేశ్వరి! నమోస్తు!